# విషయానుక్రమణిక

## 29 నవంబరు 1950





# ఆంధ్రపత్రిక

| సంవత్సరచందా<br>రు. 12-0-0<br>విడిప్రతిక<br>4 అణాలు | ప్రతి బుధవారము<br>ప్రకటింపబడును<br>**Founder: K. NAGESWARA RAO** | సంపుటము **43**<br>సంచిక **12** |
|---|---|---|

వికృతి సంవత్సర కార్తీక బహుళ పంచమి బుధవారము




కుంకుమపువ్వును తయారుచేస్తున్న కాశ్మీర్ యువతులు. ఇటీవల భారత రిపబ్లిక్ అధ్యక్షులు శ్రీనగర్ వెళ్లినప్పుడు ఈ పరిశ్రమ స్థితిగతులను పరిశీలించారు.

## మన దేశం:

# దుష్పరిపాలన, దోషారోపణ

రండాలలోనూ హాల్లోనూ రణగొణ ధ్వని వినవస్తోంది. ముగ్గురు వ్యక్తులు లైబ్రరీగదిలో కూచుని పత్రికలు తిరగేస్తున్నారు. కాని వారిదృష్టి పత్రికలపైన ఆనడంలేదు. ఆందోళన స్పష్టంగా ముఖాల్లో కనిపిస్తోంది. ఒకరన్నారు:

"ఇదంతా మన ముప్పుకే వచ్చింది. మిత్రులు శత్రువులు అనే భేదం లేకుండా అందరం అప్రతిష్ఠపాలౌతున్నాం. మంత్రులు చేసింది అన్యాయమైన మాట నిజమే. వాళ్లకి పక్షపాతబుద్ధి లేకపోలేదు. లక్షలకి లక్షలు దుర్వినియోగం చేశారు కాని—"

"ఆ పని ఎవరు చెయ్యలేదండీ. అదీ కాక ఈ లక్షలు ఎవరైనా తినేశారంటారా?"

"తినేశారనడంలేదు. కాని అంతవరకూ ప్రజల సొమ్ము నష్టంకాదూ?"

"ఒట్టిది. నష్టమూ లేదు ఏమీ లేదు. అదంతా మీ ఊహ, అనుమానం మాత్రమే. అంతవరకూ చూస్తే మీవాళ్లే ఎక్కువ అన్యాయం చేశారు. తీగ కదిపితే డొంకంతా కదుల్తుంది."

"నేననే దేమిటంటే ఏదో చేశారు. కాని దానికోసం పార్టీని భగ్నం చెయ్యకూడదంటాను. దీనివల్ల ముప్పెవరికో కానడంలేదనే నే చెప్పేది."

"ముప్పెవరికండీ? మాకేం ముప్పులేదు. దేశానికి నిజం తెలిస్తే మీకే ముప్పు."

"మాకే కాదు మీకూనూ"

"ప్రకాశంగారి కెవరూ ముప్పుతెచ్చిపెట్టలేరు. ఆయనకి ఎవ్వరూ అపకారం చెయ్యలేదు. ఆయనే చేతులారా చేసుకుంటున్నారు."

"చివరికి నష్టపడేది పన్నులు చెల్లిస్తున్న ప్రజలు."

మాట్లాడేది ముగ్గురూ శాసనసభ్యులే. మూడో సభ్యుడందుకున్నాడు. "ఎవరివల్లనూ వీసం ఉపకారం జరుగుతుందనే ఆశ ప్రజలకి ఎప్పుడో అంతరించింది. నువ్వా నేనా అని మనం కీచులాడుకోడమే మిగిలింది. ఇంక అతిశయోక్తులూ అనవసరమైన ప్రచారమూ ఒకరుచేస్తోంటే, రెండోవారు, ఆత్మవిశ్వాసం లేక నిజాన్ని దాచిపెట్టి అల్లరికి చోటిస్తున్నారు."

ఇంతలో మరొక శాసనసభ్యుడు ప్రవేశించాడు. ఆయన ప్రకాశం మంత్రివర్గంలో మంత్రి. ఆయన అందుకున్నాడు. నిజాన్ని ఎవరు దాచగలరండీ. నిజమేదో మనకంటే ప్రజలకే ఎక్కువ తెలుసు. అయినా మా మంత్రివర్గం ఇంత మరీ నియమాలు తెంచుకుని విచ్చలవిడిగా ప్రవర్తించలేదు. మేం కోర్టులో విచారణకైనా సరే సిద్ధమే. మీ మంత్రులేమీ చెయ్యకపోతే ఆ దమ్ములు చూపించరేం"

మంత్రివర్గపక్షానికి చెందిన మొదటి సభ్యుడు సమాధానం ఇవ్వబోతున్నాడు. టైమయిందని రెండో సభ్యుడు చెప్పి అక్కడితో సంభాషణ ఆపుచేశాడు.

సెంట్ జార్జికోటఆవరణలో శాసనసభ్యులూ ఉద్యోగులకంటె ప్రేక్షకులే అధికంగా ఉన్నారు. పై గేలరీలు ముందే నిండిపోయాయి, శాసనసభలో మామూలుకంటె ఎక్కువమంది సభ్యులే ఉన్నప్పటికీ హాలు పల్చగా కనపడింది. ప్రశ్నోత్తరాలు నడుస్తున్న గంటసేపూ స్పీకర్ శివషణ్ముగంపిళ్లేగారు ప్రకాశంగారితో సమాలోచనలు జరిపారు. ఇంకా రెండు మూడు ప్రశ్నలున్నాయనగా వారు సభలోకి వచ్చారు. మిగతా తతంగం పూర్తి కాగానే ప్రకాశంగారి తీర్మానంవచ్చింది.

సభలో కెల్ల వయోవృద్ధులు, అనుభవజ్ఞులు ప్రకాశంగారు. ఆంధ్రదేశంలో ప్రజలకు వీరిపట్ల కల ఆదరప్రేమలు గౌరవవిశ్వాసాలు మరే నాయకుని పైనా లేవు. నేటి శాసనసభ్యులకు మంత్రులకు గురుతుల్యులు. కాని ప్రకాశంగారు బారిష్టర్ అనుభవాన్ని పునరావృత్తి చేసుకుని, చేత ఫైల్స్ పట్టుకుని సభలో నిలిచి స్పీకర్ వంక తిరిగి మంత్రులపై నిందారోపణలు ఏకరువు పెడుతుండగా, శాసనసభ్యులకు ప్రేక్షకులకు కాలవైపరీత్యం గోచరించి ఉంటుంది. అయితే ప్రకాశంగారు ఆనాడు లాయర్ దృష్టితో ఉపన్యాసమివ్వలేదు. అన్ని అంశాలనూ నిరాక్షేపణగా నిరూపించడానికి లాయర్ ప్రయత్నిస్తాడు. ప్రకాశంగారికి ఆవిధంగా నిరూపించడానికి కావలసిన ఆధారాలు అన్నీ లేవని ఇతఃపూర్వం పరిశీలించిన శంకర్రావ్ దేవ్, రాజేంద్రప్రసాద్ గార్లు అన్నారు. అయినా ప్రకాశంగారి పట్టుదలకి కారణం రెండువర్గాలవారు రెండువిధాలుగా చెప్తారు. న్యాయశాసనరీత్యా విచారణ జరిపితేగాని దోషనిరూపణకు అవసరమైన పత్రాలు విచారణకర్తలకు లభించవని ఒక వర్గంవారు అంటారు. ఇది కేవలం మంత్రులపై దుష్ప్రచారం నిమిత్తమేనని రెండోవర్గంవా రంటారు.

ఇప్పటికే చాలకాలంగా మంత్రుల దుష్పరిపాలనగురించి ప్రకాశంవర్గంవారు చేసిన దోషారోపణలు ప్రజల్లో ప్రచారంలో ఉన్నాయి. ఇవిగాక అనేక విషయాలలో మంత్రులు ఆశ్రితపక్షపాతం చూపుతున్నారనీ, అధికారాన్ని దుర్వినియోగపరిచి శాసనసభలో తమ వర్గాన్ని బలపరుచుకుంటున్నారనీ ప్రజలు భావిస్తున్నారు. దీనికి తగినట్లే మంత్రులు తమ నిష్పక్షపాత బుద్ధిని నిరూపించడానికి ఎన్నడూ యత్నించలేదు.

పరిపాలనా వ్యవహారాలలో విశుద్ధవర్తనను నిరూపించుకోడానికి మంత్రులకు అనేక అవకాశాలు లభిస్తాయి. కాని కొద్దిమందే ఈ అవకాశాల్ని వినియోగించుకోగలుగుతున్నారు. యుద్ధంతరవాత చెన్నరాష్ట్రంలో వచ్చిన కాంగ్రెస్ మంత్రివర్గాలన్నీ అపవాదుల పాలబడినవే కాని విశుద్ధవర్తన కీర్తి సంపాదించిన మంత్రి ఒక్కరూ లేరు. శాసనసభ్యుల వ్యవహారాలు కూడా అనేక అపవాదులకు చోటిచ్చాయి.

ఈస్థితి దేశమంతటా అన్నిరాష్ట్రాలలోనూ ఉన్నదే. అల్పదోషాలు అనుమానించడానికి అనేక విషయాలు ఉంటాయి. కాని అన్నిటినీ విచారించాలంటే అది అసంభవం. అనుమానాలు ఉన్నచోటెల్ల విచారణ జరపాలంటే పరిపాలన సాగడం అసంభవం అని రాజేంద్ర ప్రసాద్ అన్నారు.

(43 వ పేజీ చూడండి)

## నిపుణాల సలహాలు:




రాష్ట్ర హోటల్ యజమానుల సభ మహా వైభవంగా జరుగుతున్నది. ప్రతినిధులకు, పత్రికా విలేఖరులకు చక్కటి సౌకర్యాలు చేయబడ్డవి. హోటల్ యజమానులకు రేషన్ అధికారులు, శానిటరీఅధికారులు కలిగిస్తున్న ఇబ్బందుల్ని నిరసిస్తూ, ఏకధాటిగా రెండు గంటలనుంచీ గంభీరోపన్యాసం చేస్తున్నాడు ఒకాయన. అనుగనుక్క చప్పట్ల కోలాహలం చెప్పటానికి వీల్లేకుండా ఉన్నది.

ఇంతకుముందు దిల్‌కుష్‌భవన్ (ఆంధ్రా హోటేల్స్) ఖ్యాతినిగురించి విన్నానే కాని, దాని యజమానిధాటిని చూట్టం ఇప్పటిదాకా పడలేదు.

సభ ముగిసినతరవాత ప్రతినిధుల బస దగ్గర ఆయన్ను కలుసుకుని 'విశ్వరూపం' పత్రికతరఫున తనతో మాట్లాడగోరుతున్నానని తెలియచేశాను.

"ఓ, అంతకన్నా కావలసిం దేమిటి? ఈరోజుల్లో మాకు ముఖ్యంగా కావాల్సినది ప్రచారమే" అని అన్నా డాయన.

*   *   *   *

"అయితే ఇంతకీ మీ వాదం ప్రభుత్వం మీకు తగిన ప్రోత్సాహం ఇవ్వటం లేదనేనా?" అని ప్రశ్నించాను.

"అవునండీ. ప్రభుత్వం బొత్తిగా దూరదృష్టి లేకుండా వ్యవహరిస్తున్నది. నూనె మిల్లులు స్థాపించటానికి డబ్బుసహాయం చేస్తున్నది, వనస్పతిఫ్యాక్టరీలకు పర్మిట్ ఇస్తున్నది. కాని వాటిలో తయారయే సరుకును వాడవలసినవాళ్ళం మమ్మల్ని నిరుత్సాహపరిస్తే ఎట్లా?" అన్నా డాయన.

"అయితే మీరూ వాడేది ఆ సరుకే నంటారా, ఏమిటి?"

"మరి యేమిటనుకుంటున్నారు?"

"ఆఁ! ఏదో గ్రౌండ్‌నట్ ఆయిల్ వాడతారని అంతా అంటారులేండి."

ఆయనకు కొంచం కోపంవచ్చింది. ఏదో అనబోయి, యింతలో చటుక్కున ఏ సంగతో జ్ఞాపకంవచ్చి పెద్దగా నవ్వాడు.

"అట్లా వాళ్ళు అంటానికి అవకాశం ఉందిలేండి. మాలో కొంతమంది వాడే వంటనూనెను చూస్తే అట్లాగే అనిపిస్తుంది" అన్నాడు.

"ఏమండీ! కాఫీహోటల్ లాభంగా ఉంటుందా, లేక భోజనహోటల్ లాభంగా ఉంటుందా? అని ప్రశ్నించాను.

"మొదట్లో భోజనహోటలే లాభంగా ఉండేది. కాని రేషన్ పెట్టినప్పటినుంచీ కాఫీహోటల్ కూడా దానితో సమానమయిపోయింది."

"అదేమిటండీ అట్లా అంటారు? రేషన్ వల్ల పెట్టే అన్నం తగ్గిపోతుందికదా? అందుకని భోజనహోటళ్ల లాభాలు పెరగవూ?"

"కాస్తో, కూస్తో పెరుగుతయ్ కాని కాఫీ హోటళ్ళకి తగిలేటంత గిరాకీమాత్రం ఉండదు. పప్పులో వీర నేతిలో తీయాలంటారే, అట్లాగే అన్నంలో వారను కూరల్లో లాగాలని జనం చూస్తారు."

"మీరు మాత్రం తక్కువవాళ్లా యేమిటి? అసలు వడ్డించటంలోనే చూపిస్తారు మీ నైపుణ్యం అంతా. గరిటె విస్తరికి వేసి కొట్టటం తప్పితే, దిగనుపడటం ఏమయినా ఉంటుంది కనకనా?"

"అంతమాత్రంతో జనం వొదుల్తారటండీ? ఇదివరకు రోజుల్లో అయితే కొసిరి కొసిరి వేయించుకునేవాళ్ళను చూసి అంతా నవ్వేవాళ్లు. కనుక వడ్డనవాళ్ళకి చులకనగా ఉండేది. ఇప్పుడే ముంది, బంతికి బంతీ వచ్చిన పదార్థాన్నల్లా వదలకుండా వేయించుకోటమే కదా! మొదటిబంతి వాళ్ళే చేసిన సరుకుని గుటకాయస్వాహా చేస్తున్నారు."

"మరికడుపు నిండకపోతే ఏంచేస్తారు?"

"దానికి మేము మాత్రం యేం చేస్తాం? కడుపు నిండకపోతే, రేషన్ పెంచమని ప్రభుత్వంవాళ్లను అడగమనండి. రేషను పెరిగితే మహరాజులకల్లే చేసిపెడతాం. లేకపోతే మేముమాత్రం యెక్కడనుంచి పుట్టించుకురాగలం చెప్పండి."

"అపాటి విద్య మీకు రాకపోతేకదా?"

"ఎన్నివిద్యలు తెలిస్తేమటుకు, ప్రభుత్వం ఊ అనందే మేము ఏం చేయగలం? జనంబాధ చూడలేకనే, మేమంతా భోజనహోటల్‌పక్కనే కాఫీహోటళ్లను తెరుస్తున్నాం."

"ఆఁహాఁ! అందుకనా, ఇప్పుడు ఎక్కడ చూసినా హోటళ్ళే కనిపిస్తున్నది?"

"ఔనండీ. తిండి చాలకపోతే మళ్ళీ టిక్కట్టుకొని భోజనం చేసేవాడెవడూ, కాఫీతాగేవాడు తప్పితే. అప్పటికీ ఎవరయినా కక్కుర్తిపడితే మేము చూసీ చూడనట్లు ఊరుకుంటున్నాం."

"అయితే డబ్బున్నవాడికి రేషన్‌బాధే లేదంటారు."

"ఏమీ లేదు. వాళ్లకి కావాలంటే బ్లాక్‌మార్కెట్‌సరుకు దొరుకుతుంది. ఆ తిప్పలుపట్టం ఇష్టం లేకపోతే హేమున్నాము."

"మీరు ఈ వ్యాపారంలోకి దిగి ఎన్నాళ్ళవుతుంది?"

"ముప్ఫయ్యేళ్లు దాటింది."

"అబ్బో! అయితే మీ అనుభవాలు అద్భుతంగా ఉండిఉంటయ్."

"ఏదో ఉంటయ్ కానీయండి, అయితే నేను పడ్డ ఇబ్బందులుమాత్రం అంతా పడవలసి ఉండదు."

"అంటే?"

"వ్యాపారాన్ని మొదలుపెట్టి ఒక పద్ధతిలోకి తీసుకునిరావటం మాటలా? మొదట్లో కనుక మేము ఎన్నో ఇబ్బందులు పడ్డాము. ఇప్పుడు బండి ఒకదారిన పడ్డది కనుక, కొత్తగా వచ్చేవాళ్ళకు ఆ బాటే ఇబ్బందులు ఉండవు."

"శ్రమ అనుకోకుండా ఉంటే, దాన్ని మీ రెట్లా సాధించారో దయచేసి చెప్తారా?"

"అందులో శ్రమ యేమున్నది? నేను మొట్టమొదట పకోడీలూ, మసాలాగారెలూ మొదలైనవాటిని నెత్తిన పెట్టుకుని ఇల్లిల్లూ తిరిగి అమ్ముకునేవాడిని. స్కూలుదగ్గర, కోర్టుదగ్గర, తాలూకా ఆఫీసుదగ్గర, దేవాలయందగ్గర మాలో కొంతమంది స్థిరంగా మకాం పెట్టుకునేవాళ్లు. తీర్థస్థలాల్లో బిచ్చగాళ్లు తమ స్థలాలను రిజర్వు చేసుకున్నట్లుగానే, వాళ్లుకూడా ఆ స్థలాలను వదిలేవాళ్లు కాదు. అందుకని మేము మా సంచారాన్ని టైమునిపట్టి ఏర్పాటుచేసుకునేవాళ్ళం"

"టైమునిపట్టి అంటే?"

"స్కూలు ఆటవిడుపుటైముకీ, మూసేవేళకూ అక్కడికి జేరేవాళ్ళం ఇట్లాగే కోర్టులు, తాలూకాఫీసులవెంట సమయానుకూలంగా తిరిగేవాళ్ళం. ఆ రోజుల్లో హాకర్ లైసెన్సులూ, శానిటరీవాళ్ళ గొడవలూ, పోలీసుల జులుం ఇంత చేటుగా ఉండేవి కాదు."

"ఓహో."

"తరవాత కాఫీహోటల్ పెడదామనిపించింది. కాఫీహోటల్ అంటే, కనీసం ఒక రేకుల షెడ్డుకింద, విరిగిపోయినవో, ఊగులాడేవో నాలుగు బల్లల్నీ, బెంచీలనీ పడెయ్యాక తప్పదుకదా! దానికి డబ్బు కావాలి అంతే కాకుండా భారీఎత్తులో పాలసప్లయికూడా అవసరమయి ఉంటుంది. ఇవన్నీ నాబోటివాడికి ఎట్లా తూగుతయ్యా అనేది పెద్ద చిక్కు అయిపోయింది ఆలోచించగా, ఆలోచించగా, ఫస్ట్ క్లాసయిన ఒకటి తట్టింది"

"అవును మరి. ఉపాయం లేనివాళ్ళను ఊళ్లోనించి తరిమెయ్యమన్నారు."

"హా హ్హా హ్హా! భేషుగ్గా చెప్పారు. ఏమిటయ్యా ఆ ఉపాయం అంటే, పాలవాళ్లనే పెట్టుబడి పెట్టమని అడగటం ఊళ్లో పాలు, పెరుగు సప్లయి చేసే నలుగురు మోతుబరి ఆసాములదగ్గరికి వెళ్లి, నా ప్లానంతా చెప్పాను. షెడ్డువేసి, బల్లలు, బెంచీలు పడెయ్యటానికీ, పాత్రసామగ్రి కొనటానికీ, కొన్నాళ్లపాటు బండి సాగటానికీ, కావలసిన పెట్టుబడిని వాళ్లు పెట్టాలి. రోజూ హోటలికి కావలసినవాలను సప్లయి చేయాలి. నేను వ్యాపారం నడిపి, వాయిదాల్లో వాళ్ళసొమ్ము చెల్లిస్తానని చెప్పాను."

"దీన్లో వాళ్లకి పెద్ద లాభమేముంది? వ్యాపారంలో వాటా అడగలా?"

"ఊహుఁ! అడగలేదు అడిగినా నేను ఒప్పుకోదలచలేదు. అయినా, వాళ్లకి లాభం లేకపోవటమేమిటి? వాళ్లదగ్గర కొస్తోకొస్తో డబ్బుండేది. అది ఎట్లా పెట్టుబడి పెట్టాలో వాళ్లకు తెలిసేదికాదు అద్గీకాక హోటలికి పాలు సప్లయి చేయటంవల్ల వాళ్లకు ఎంతో శ్రమ తగ్గిపోయి, భారీఖాతా ఏర్పడేది. పాలు మిగిలిపోతయ్యేమోనన్న భయం ఉండేది కాదు"

"అవును మీ ప్లాను సబబుగానే ఉంది"

"ఉంది కాబట్టే ఇప్పుడు అంతా దాన్నే ఉపయోగిస్తున్నారు తెలుగు దేశంలో ఏ పక్కకయినా వెళ్లండి చిన్నరకం హోటళ్లన్నీ నాప్లాను ప్రకారమే నడుస్తున్నయ్" అని ఆయన గర్వంగా చూశాడు.

ఆయన్ని ఉబ్బెయ్యటానికి నేనుకూడ ఆశ్చర్యాన్ని నటించి "తరవాత?" అని ప్రశ్నించాను.

"తరవాతి కథలో అట్టే విశేషమేమీ లేదు షెడ్డుహోటల్లో కొస్త డబ్బు చేరిన తరవాత, పెద్దఎత్తులో నడిపించటం మాత్రమే జరిగింది డబ్బు కొంత ఉంటే, మన తెలివితేటలు అట్టే అవసరంలేకుండానే పిల్లల్ని పెడుతుంది"

"మీరు దక్షిణాదిఅన్నయ్యలతో పోటీ రాలా?"

"రాకేం? వాళ్ల దెబ్బకు నే నొకసారి దివాలా తీసేవరకు వచ్చింది. కానీ—వాళ్ల తస్సాదియ్యా! హోటల్ వ్యాపారంలో వాళ్లు అందెవేసిన చేతులండీ"

"అయితే మరి ఇప్పుడు ఉడిపివాళ్ల జండా ఎగురుతున్నదేం?"

"వాళ్లూ, గుజరాతీలూ మానేజిమెంటులో ఆరితేరిన చేతులు. కాని స్వయంగా బండిని నడిపించలేరు దక్షిణాదివాళ్లదగ్గర స్వతంత్రించి నడిపే తాహతుకన్నా, ఒకళ్ల కింద పనిచేసే శక్తి ఎక్కువగా ఉన్నది అందువల్ల ఉడిపివాళ్లూ, గుజరాతీలూ మానేజ్ చేస్తుండగా, అరవసోదరులు హోటళ్లను నడుపుతున్నారు"

"మరి మన తెలుగువాళ్ళో?"

"బ్రాంచేస్తున్నారు. వీళ్లకి కర్రపెత్తనం చేసే నెళుకువా, చాకిరిచేసే ఓపికా, రెండూ లేవు."

"అంతే సంబారా?"

"కానండీ మనవాడు సర్వరుగా చేర్తాడనుకోండి. మహాతాత్సారంగా సర్వు చేస్తాడు కొంచెం తొందరగా తేవయ్యా బాబూ, అంటే నాలుగు ఝాడించి, ఇంకా ఆలస్యం చేస్తాడు. ఇంకా ఆలస్యం చేశావేమిటని అడగటం బుద్ధితక్కువ ఒకవేళ అడిగితే! 'ఏమిటయ్యా, నీ అథార్టీ. తింటే తిను, లేకపోతే బయటికి నడు' అంటాడు"

"మానేజిమెంట్ కూడా ఇంతేనా!"

"అది కొంచెం మెరుగే ననిపిస్తుంది కాని మన వూళ్లను చూస్తుంటే అనుమానంగానే ఉంటుంది. బెజవాడలాంటి ఊరును తీసుకోండి. ఏ కొద్దివాటిని మినహాయిస్తే, మిగిలిన హోటళ్లన్నీ నెల కొకసారి బోర్డు తిప్పుతూ ఉంటయ్ కదా"

"దక్షిణాదిపోటీలో మీరు నేర్చుకున్న [illegible]కులు ఏమయినా ఉన్నయ్యా!"

"ఎన్నో ఉన్నయ్. కాతాదార్లను [illegible]ం వాళ్లు నేర్పిన విద్యే. అంతవరకూ సరుకు బాగా ఉంటే చాలని అనుకునేవాళ్లు."

"ఎందుచేత?"

"తెలుగువాడి దృష్టి పెసరట్ల వెంకయ్య

గాడి పొయ్యిని దాటి పోదు. పొయ్యి పక్కన గొంతు కూర్చుని, చేతుల్లో ఆకులు పెట్టుకుని తినే మొగవాళ్ళూ, పిల్లలచేత ఇంటికి తెప్పించుకుని తినే ఆడవాళ్లూ కనిపిస్తారు. అందువల్ల సరుకు బాగా ఉంటే చాలనుకునేవాళ్లు.”

“ఆ పరిస్థితి ఎందుకు మారిందంటారు?”

“భారీఎత్తున సరుకును చేయాలంటే నాణెంగా ఉండటం కష్టం. ఎక్కువ లాభాలు కావాలంటే, ఇతర ఆకర్షణలు చూపించి సరుకును, భారీగా అమ్మాలి. తెలుగువాడి హోటలికి వెళ్ళి విరిగిపోయిన బెంచీలమీద కూర్చుని, చితచితలాడే బల్లలమీద, కడిగీ కడగని, ప్లేట్లతో పొగలో బాధపడే బదులు, కొంచం రుచి తక్కువయినా, అరవహోటలికి వెళ్లి తళతళలాడే బల్లలూ, గిర్రున తిరిగే ఫానులూ, మయసభామోస్తరు అద్దాలూ మధ్య కూర్చుని తినాలని ఎవడయినా అనుకుంటాడు. హోటల్ నడపటంలో నామర్దా ఏమీ లేదన్న విషయాన్ని కూడా వాళ్లు నేర్పారు.”

“జనంఆర్థికపరిస్థితులు, అభిరుచులు తెలియటానికి మీకు ఎక్కువ అవకాశం ఉన్నదేమో?”

“కొంతవరకూ ఉంది. 1930 వరకూ హోటలుకి వెళ్ళటమంటే పెద్ద వ్యసనమని పెద్దవాళ్లు భావించారు. కాని తరవాత అదే ఫాషన్ అయింది.

“1930 ప్రాంతపు డబ్బుకటకట దెబ్బ మీకేమయినా తగిలిందా?’’

“బాగానే తగిలింది. అప్పుడే హోటల్లో తిని డబ్బు ఎగెయ్యటం జనానికి అలవాటయింది. కుర్రకారు-అంటే అప్పటి కుర్రకారు - భాయ్, బ్రదర్ అంటూ ఎంతో చనవుగా ఎదటివాడితో మాటకలిపి, బిల్లు వాడికి వదిలి జారుకునేవాళ్లంటే డబ్బుకటకట ఎంత తీవ్రంగా ఉండేదో ఆలోచించుకోండి. అప్పటి కుర్రకారుని ఇప్పటికైనా నేను గుర్తుపడతానంటే, వాళ్లమీద ఆ దెబ్బ ఎంత గట్టిగా అచ్చు గుద్దుకు పోయిందో తెలుస్తుంది.’’

“1935 తరవాత?’’

“1937 లో ఎన్నికలు వచ్చినయ్. అప్పుడు రెండు నెలలపాటు హోటళ్లు డబ్బును మహా దోచినయ్. ఇంతలో యుద్ధం వచ్చి మా పంటపండింది.’’

“ఎందువల్ల?’’

“ఉద్యోగాలు లేని జనం యుద్ధంలో చేరారు. ఒకచోటి జనం మరొక చోటికి ఫిరాయింపు జరిగి హోటళ్లమీద ఆధారపడ్డారు.”

“మీకు పంచదార, సెనగపిండి ఎట్లా దొరికేవండీ?’’

“నగరాల్లోఅయితే పెద్ద అధికారులు సాయపడేవాళ్లు. చిన్న పట్నాల్లో అయితే చుట్టుపక్కల ఉన్న పల్లెటూళ్ల నాయకులు తోడుపడేవాళ్లు.”

“ఏవిధంగా?”

“గ్రామాల్లో మోతుబర్లుంటారు చూశారూ, గ్రామకాంగ్రెస్ దగ్గర నుంచి కోఆపరేటివ్ సొసైటీలవరకూ వాళ్ల చేతుల్లోనే ఉంటయ్. వాళ్లు బస్తీలకు వచ్చి, తమ గ్రామపు రేషన్‌ని మాకు ఇచ్చి, నోట్లు జేబులో పెట్టుకుని పోయేవాళ్లు. వాళ్ల దెబ్బకి ఎదురులేదుగా!”

“కాఫీహోటళ్లు పల్లెల్లో వ్యాపించి, జనం వొళ్లొంచి పనిచేయకుండా తయారైనారండీ.”

“ఇందులో మా తప్పేమీ లేదు. ఈ విషయమై కొంతమందిని అడగ్గా వాళ్ళిచ్చిన జవాబును వినండి. ‘ఎవరికోసం పోయి రెక్కలు విరుచుకుంటాం? పొలం దున్నేవాళ్లకే భూములని మీటింగుల్లో అరుస్తారే కాని ఎవ్వరూ అమలుజరపరు. మా వీలునుపట్టి పని చేస్తాంలే’ అన్నారట.’’

“ప్రభుత్వంమీద శానిటరీ, కంట్రోలు వ్యవహారాలే కాక ఇంకా ఫిర్యాదులున్నయ్యా?’’

పెద్ద ఫిర్యాదు ఒకటున్నది. ఎన్నికలు సరిగా జరపకపోవటంవల్ల, వాటి ప్రచారంలో మాకు వచ్చే డబ్బు పోయింది.’’

“మీకు మేలు చేసిందెవరు?’’

“విద్యాశాఖవాళ్లు. స్కూల్ ఫైనల్ పరీక్షలకు కూడా సెప్టెంబర్ ఛాన్సు ఇచ్చారు. పరీక్షచదువులంటే హోటళ్లకి ఎంత గిరాకో తెలుసుగా?”

“మీ పరిశ్రమవల్ల దేశానికి నిజమైన మేలు ఏమయినా ఉన్నదా?’’

“ప్రాంతీయద్వేషాలు నశించిపోతయ్. వుడిపివాళ్లూ, గుజరాతీలు మానేజ్ చేయగా, అరవలు పనిచేస్తుండగా, ఆంధ్ర ప్రజానీకం కుల, మత, లింగవివక్షత లేకుండా బొంబాయి హల్వా, బెంగాలీ రసగుల్లా, యు. పి. బాద్షా, మార్వాడీ జిలేబీ, అమెరికన్ ఐస్‌క్రీం సేవిస్తారు. ఇంతకన్నా కావలసిందేమిటి?’’

“ఒక్కటి ఉన్నది. పెద్ద హోటల్ పెట్టేది ఎట్లా?’’

“పొలం, పుట్రా ఉంటే అమ్మి డబ్బుతీసుకురాండి. దగ్గరుండి చేసుకునే వాడికి తప్ప పొలం గిట్టుబాటు కాదు. ఆ డబ్బుతో పెద్ద పట్నంలో ఏ కాలేజీఎదురుగానో, స్టయిల్ లో హోటల్ పెట్టండి. ఆడసర్వర్లు మరీ మంచిది. ప్రారంభోత్సవాన్ని ఒక మంత్రిగారిచేత జరిపించండి. వాటాదార్లుగా మంత్రులనో, ఎం. ఎల్. ఏ. లనో, వాళ్ల చుట్టాలనో తీసుకుంటే పరమశుభం...మాకు మీటింగ్ వేళ అవుతున్నది.” అంటూ ఆయన లేచాడు.



# పదిరోజుల విప్లవం

నేపాల్ దేశంలో కాంగ్రెస్ విప్లవం పది రోజుల్లో మణిగిపోయింది. "1942 ఉద్యమాన్ని నేపాల్ దేశంలో ప్రారంభిస్తున్నా" మని ఒక నేపాల్ కాంగ్రెస్ నాయకుడన్నాడు. ఆ విప్లవం మాదిరిగానే ఇది కూడా అంతరించడానికి ఆట్టే రోజులు పట్టలేదు. నేపాల్ కాంగ్రెస్ ఆదేశాన్ని ప్రభుత్వసైన్యాలు పాటించలేదు. సాయుధ విప్లవాన్ని ప్రభుత్వం అణిచివేసింది.

విప్లవం విఫలంకావడానికి ముఖ్య కారణం విప్లవకారులకు భారతదేశంలో నైతిక సహాయంకూడా లభించకపోవడమే. మహారాజాధిరాజు పరారికాగానే ఆరంభమైన ఈ విప్లవం పట్ల భారత ప్రభుత్వం ఎట్టివైఖరి అవలంబిస్తుందో నేపాల్ ప్రభుత్వం మొదట కనిపెట్టింది. మహారాజాధిరాజును కాపాడి శరణిచ్చిన భారతప్రభుత్వం విప్లవకారులకు సహాయం చెయ్యడం లేదని తెలియగానే నేపాల్ ప్రభుత్వం సమాలోచనల నిమిత్తం రాయబారిని పంపడం ఇప్పటికి మానుకున్నది. విప్లవాన్ని అణచిన తరవాతనే రాయబారాలు జరగవచ్చని స్థిమితపడింది. ఇంతేకాకుండా భారతప్రభుత్వం నేపాల్ సరిహద్దుల వద్ద రాకపోకల్ని అరికట్టడంతో విప్లవకారులకు సహాయం లభించకుండాపోయింది.

విప్లవం అణిగి పోకముందే నేపాల్ ప్రభుత్వాన్ని మంచి చేసుకోవాలని బ్రిటన్ ఆతురపడింది. మలయాలో కమ్యూనిస్టుదళాలతో పోరాడ్డంకోసం ధనమిచ్చి గూర్ఖాలను వేలాదిగాతీసుకుపోతున్న బ్రిటిష్ వారికి విప్లవం గూర్ఖాల ఎగుమతికి ఆటంకమయింది. విప్లవం త్వరలో అంతమైపోవాలని బ్రిటన్ అమెరికాలు తొందరపడ్డాయి. రహస్యంగా రాణాప్రభుత్వానికి సహాయం పంపడం కోసం బ్రిటన్‌పాకిస్తాన్ ప్రభుత్వంతో మంతనాలు జరిపిందని వదంతికూడా వచ్చింది.

భారతదేశంతో నిమిత్తం లేకుండా నేపాల్‌తో స్వయంగా రాజకీయాలు నెరపడానికి బ్రిటన్ అమెరికాలు మొదటి నుంచీ యత్నిస్తూనే ఉన్నాయి. రాణా తన నిరంకుశ పరిపాలన సుస్థిరపరుచుకోడానికిగాను ఆదేశాలతో మైత్రికి ఒడబడ్డాడుకూడా.

ప్రజాస్వామ్యం నెలకొల్పే విషయమై భారత ప్రభుత్వం చేసిన సూచనల పట్ల మహారాజాధిరాజు సుముఖత ప్రకటించటంవల్ల, రాణా తన ప్రాబల్యాన్ని కాపాడుకోవాలనే అభిప్రాయంతో మహారాజాధిరాజును అంతఃపురంలో బందీగా ఉంచాడు. అయితే భారత ప్రభుత్వం మహారాజాధిరాజుకు శరణ్యమిచ్చింది

టిబెట్ కమ్యూనిస్టుల అధీనం కావడం తథ్యమని తోచగానే బ్రిటన్ అమెరికాలు నేపాల్ ప్రభుత్వం తమ పక్షాన ఉండడం ఆవశ్యకమని భావిస్తున్నాయి. అందువల్లనే మహారాజాధిరాజుకు శరణ్యమిచ్చినప్పటికీ పిప్లవకారులకు భారత ప్రభుత్వం కాని, భారతీయులు కాని ఎట్టి సహాయం ఇవ్వకుండా బ్రిటన్ అమెరికాలు కనిపెట్టి చూశాయి.

విప్లవం నిలవజాలదని తెలియగానే నేపాల్ రాజరికం మార్పుకి అంగీకరించడమా, అంగీకరించకపోవడమా అనే సమస్య ఉత్పన్నమయింది. రాణా పరిపాలనకు సుముఖంగా ఉన్న బ్రిటన్ పసిరాజును మహారాజాధిరాజుగా పరిగణించతలపెట్టింది. కాని భారతప్రభుత్వం పసిరాజును గుర్తించడానికి నిరాకరిస్తున్నది. ప్రజల అభిమతం ప్రకారం నిర్ణయం జరగాలని భారత ప్రభుత్వం అభిప్రాయం. ప్రజల అభిమతం ప్రజాస్వామ్య స్థాపనకు వ్యతిరేకుడైన రాణా ప్రభుత్వానికి సుముఖంగా ఉండదనే మాట స్పష్టం. ప్రజల అభిమతం ప్రకారం ప్రభుత్వం ఏర్పాటయిందంటే, రాణా అధికారం నీరసించి పోతుంది. మలయా దేశస్థులపై యుద్ధానికి గూర్ఖాలను ఎగుమతి చెయ్యడానికి ప్రజల ప్రభుత్వం అంగీకరించకపోవచ్చును. అందువల్ల రాణా ప్రభుత్వాన్నే స్థిరపర్చాలని బ్రిటన్ అభిమతం. భారతప్రభుత్వం బ్రిటన్ అమెరికాల అభిమతానికి తలొగ్గుతుందో, నిరాకరిస్తుందో తేలడానికి, నేపాల్ ప్రభుత్వంతో రాయబారాలు పూర్తికావాలి. ఈ రాయబారాలు ఎప్పటికప్పుడు వాయిదా పడుతున్నాయి.

దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యని గురించి ఐక్యరాజ్యసమితి రాజకీయసంఘం చర్చించింది. బొలీవియా, బ్రెజీల్ మొదలైన అయిదుదేశాలు కలిసి ప్రవేశపెట్టిన తీర్మానం సవరణలతో అంగీకరించబడింది. భారత ప్రతినిధివర్గం తమ తీర్మానాన్ని ఉపసంహరించుకుని సవరించబడిన పై తీర్మానాన్ని అంగీకరించింది. 1951 ఏప్రిల్ లోగా రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సు జరిపి సమస్యను పరిష్కరించ యత్నించాలని దక్షిణాఫ్రికా, భారతదేశం, పాకిస్తాన్‌లను ఆదేశిస్తూ, ఆ సమావేశం విఫలమయ్యే పక్షంలో రాయబారాలను సాగించడానికి ముగ్గురు సభ్యులు కల ఒక కమిషన్‌ను నియమించాలని ఈతీర్మానం సూచిస్తున్నది. "మాలపల్లెల" శాసనాన్ని కాని, రాయబారాలకు ప్రతిబంధకం కాగల మరే శాసనాన్నిగాని అమలు జరపరాదని దక్షిణాఫ్రికాప్రభుత్వానికి స్పష్టంగాచెప్పబడింది. ఈతీర్మానంపైన బ్రిటన్, అమెరికా, రష్యా, ఫ్రాన్సులు సహా మొత్తం 24 దేశాలు ఓటు చెయ్యలేదు. ఇది ఒక విధంగా భారతదేశానికి విజయమే. కాని సమితి సర్వసభ్యసమావేశంలో ఈ తీర్మానం నెగ్గించడం కష్టం. కారణం ఏమిటంటే రాజకీయ సంఘంలో యుగోస్లావియా మినహా శ్వేతజాతుల రాజ్యాలలో ఏదీ అనుకూలంగా వోటు చెయ్యలేదు. అనేక సవరణలు ప్రవేశపెట్టబడినందువల్ల మొట్టమొదట తీర్మానాన్ని ప్రవేశపెట్టిన బొలీవియా, బ్రెజీల్, నార్వే, డెన్మార్క్, స్వీడన్ దేశాలే వ్యతిరేకంగా ఓటు చేశాయి. ఆసియాఖండాన్ని కమ్యూనిస్టుల బారినుంచి కాపాడి ఆ దేశాల ప్రజల్ని ఉద్ధరించడానికి కంకణం కట్టు

(44-వ పేజీ చూడండి)




మేడముందరి వసారాలో నిలబడి, చిన్నారి జమీలా, క్రింద మిలమిలా మెరిసే ఆ అత్యద్భుత దృశ్యాన్ని కేసి తదేకధ్యానంగా చూస్తోంది. ఒకసారి తనచుట్టూ వింతగా కలయజూసింది. తాను కలగంటుండలేదని ధృవపరుచుకోనేందుకు తన ఆ చిన్న పెదిమల్ని, ఒకటి రెండు, సార్లుగా మునిపళ్లతో గట్టిగా కొరుక్కుంది! తాను కట్టుకున్న విలువైన దుస్తులకేసి చూస్తున్నంతసేపు, తను ఆ కాళంలో ఏచంద్రలోకంలోనో, దేవలోకంలోనో, విహరిస్తున్న యక్షపిల్లేమో అనుకుని భ్రమించింది. అటువంటి వైభవోపేతమైన వాతావరణంలో జమీలా యిదివరకెన్నడూ ఉండలేదు.

ఇల్లంతా కళ్ళకు జిగేలుమనిపించే కాంతియుత విద్యుద్దీపావళితో, అలంకరించబడింది. ఇంటిముందరి పిట్టగోడల మీద తీగెలల్లే ఒక్కవరుసగా పెట్టబడిన ఆ ఎలెక్ట్రిక్ బల్బులు ఎఱ్ఱగా-పచ్చగా, వింతవింతరంగుల్ని విరజిమ్ముతున్నాయి, శోభాయమానంగా.

చిన్నప్పుడు జమీలా తన అవ్వఒళ్లో కూర్చుని వింటున్న ఒక్క రాజు–రాణి కథల్లోని పెళ్ళిదృశ్యాలప్పుడు కళ్ళకు కట్టినట్టుగావుంది.

తన చుట్టూ కూడా అందమైన స్త్రీలెంతోమంది విలువైన వస్త్రాభరణాలతో అలంకరించుకుని, సీతాకోకచిలుకలల్లే అటూ-యిటూ తిరుగుతున్నారు. కొందరు 'దివాన్' లో సుఖంగా కూర్చుని కులాసాగా ముచ్చటించుకుంటున్నారు. మరికొందరు మేడమీది వసారాలో గుమిగూడి నిల్చుని క్రింది దృశ్యాన్ని వలోకిస్తూ ఆనందంగా నవ్వుకుంటున్నారు.

సామరూపంగా నిలబడివున్న ఆ 'నవాబుల' అంతఃపురం, యీ నాల్గు రోజుల్లోనూ, శృంగారవిహారాల్లోనైతేనేమి, క్రిక్కిరిసిన ఆజనసందడితోనైతేనేమి, పూర్వకాలపు ఔన్నత్యాన్ని, అప్పటి రాజభోగ-విలాసాల్ని, వైభవ సంభ్రమాల్ని ఎలుగెత్తి చాటుతున్నట్లేవుంది. అయితే యిప్పటి స్థితిగతులు వేరు. ఐశ్వర్యాలూ-సామ్రాజ్యాలతోబాటు కష్టమూ—దారిద్ర్యమూకూడా. సరిసమానమైన కొవిడి కుండలేనని చెబుతూ, తన్ను తాను ఓదార్చుకుంటాడా నవాబు! అందుచేత అటువంటి దైవనిర్ణీతమైన దారిద్ర్యావస్థలో, వుంటుండికూడా, ఆ ప్రభుత్వవర్గానికి చెందిన కులీనుడికి, తన హోదాకు తగ్గట్టు—భవంరాజసరీత్యా— వివాహమహోత్సవం జరిపించడమెలాగో సుళువుగా తెల్సుగనుక, ఆ వివాహమన్నది చూపరులకు కన్నుల పండువుగానే వుంది!

ఈ వైభవాన్ని చారెడేసివున్న తన కళ్లతో తిలకించినతర్వాత, జమీలాకు ఒకళ్లు పెళ్లిజేసుకోడమంటే, ఎటువంటి ఘనకార్యమో, అలాంటిది ఎంత ముచ్చటగా, సరదాగా వుంటుందో అని తోచింది. తను అటువంటి ఖరీదైన దుస్తుల్ని ఎప్పుడూ ధరించలేదుగా! పైగా అది కాస్త తన పెత్తండ్రి కూతురిపెళ్లే అవుతే...యిహ తన వరుసకూడా వచ్చింతరువాతనో? ఆ చిన్న మెదడులో ఒక్కసారి తొలకరిమెఱుపులా

మూలం ★ అనువాదం

కమలాజాస్పర్. శ్రీ కుంకనూర్ శేషగిరి

మెరిసింది, తన వివాహ విషయమై. చిన్నగా నవ్వుకుంది!

తన పెత్తండ్రికూతురు, అంటే పెళ్లికూతురే—ఎటువంటి వస్త్రాలు కట్టుకుందో చూస్తున్నంతసేపు జమీలాకు సంభ్రమాశ్చర్యాలుతోడుగా వస్తున్నాయి. ఇంద్రుడి ధనుస్సులో ఎన్నిరంగులైతే వుంటాయో అన్నిరంగుల కుప్పగా వుంది. ఆవిడ 'గాగరా'. చుట్టూ అంచులు బంగారు—వెండి లేసులతో కుట్టబడినయి. ఆ మేలి ముసుగు ఆసందర్భంకోసమే ప్రత్యేకించి విలువైన సిల్కులో నేత వేసినట్టుంది. మధ్య మధ్యను ధగ—ధగ మెఱుస్తున్న రత్నాలు—కెంపులు, ఆ ముసుగుకి అతికించబడినయ్. ఆమె ధరించిన ప్రతిఒక్క బంగారపుఆభరణమూ కూడ, విద్యుద్దీపకాంతుల్లో ప్రత్యేకమైన కాంతిని ప్రతిస్ఫుష్టిస్తూ తళుక్కుమని నక్షత్రాల్లా మెరిసిపోతున్నది. అలా ఆవిడ తల వొంచుకుని సిగ్గు లొలకబోస్తూ కూచుంది. ఏ ముసలవ్వగాని, ఆవిడ కూచున్న తీరునో, కాకపోతే ఆవిడ కాబోయే భర్త అందచందాల గురించిగాని, కులాసాగా ఏమైనా అంటూంటే ఆవిడ మరింత సిగ్గుపడి, ఎఱ్ఱబారి అదోలాంటి అందంగా కన్పించే, తనముఖాన్ని క్రిందికి తగ్గించుకుంటుంది.

జమీలా మాత్రం, యీ వింతలన్నీ అత్యంతాశ్చర్యంతో, సంభ్రమంతో చూస్తూ, ఆ దిక్కుతోచని సమయంలో అటూ యిటూ చెలాకీగా గెంతుతూవుంది. ఒకోసారి పెళ్లికూతురికి మిక్కిలి దగ్గరగా కూచుని ఆనందిస్తుంది. మరోకసారి తల వాకిటివద్దకు వెళ్లి లోనికి అడుగిడుతున్న సౌందర్యరాసులైన స్త్రీతండాని పరికిస్తూ నిల్చుంటేది.

ఎటుచూసినా మనుషులే—పుట్టుకొస్తున్నారా—అన్నట్టుగా, సందడి—మాటలు అరుపులు— గోల; యీగోలతోబాటు ఒక్కసారిగా తూర్యనినాదాలు, ఢంకా బజాయింపులు మొదట సన్నగా వినవస్తూ, ఆ తరువాత చుట్టు వాతావరణంలోని గాలినంతా ఆవరించుకుంది. ఎవళ్ళో "పెళ్ళికొడుకు తాలూకు వారంతా తరలివస్తున్నార"ని పెద్దపెట్టుగా నుడివారు. పిల్లలంతా చేతులుకలుపుకొని ముందరి వసారాలోకి పరుగెత్తి వచ్చారు. స్త్రీలు అనిముషానే తమముఖాలు లవుపించనట్టుగా తెరవెనుక దాక్కున్నారు.

తరువాత ఆ నవాబు మేలు రకపు పట్టు వస్త్రాలతోనూ, విశిష్టంగా అలంకరించుకుని అలంకరణలో తనకు తీసికట్టుగా వుండేటి బంధుమిత్రుల సమేతంగా, పెళ్లివారి గుర్రోక్కడానికి బంగళాముందరిగేటుదాటి బయల్దేరాడు. ఆఉత్సవం మెల్లిమెల్లిగా దగ్గరికి వస్తూవుంది. నిజంగా, పుట్ట నించి బయలువెడలిన చీమలల్లే వరుసబారి వస్తూవున్నారు. ఆ జనమంతా ప్రతివారూ ఎఱ్ఱరంగు పట్టుషరాయిలూ, కోట్లూ తొడిగారు. తలకుమాత్రం చిలకరంగు పచ్చటి పాగాలు చుట్టుకొని మంద గమనంతో అలా వస్తున్నారు. ఉత్సవం మధ్యని, విచిత్రంగా అలంకరించబడిన ఆరు ఏనుగులు వస్తున్నాయి. మూడో ఏనుగమీద నవరత్నఖచితంగా, వజ్రవైడూర్యాలతో, బంగారు మాలలతో శృంగారించబడిన అంబారిపై పెళ్లికొడుకును ఊరేగిస్తున్నారు. అతని ముఖమంతా, సన్నమల్లెలతోనూ రోజాపువ్వులతోనూ గ్రుచ్చిన సరాల వరుసలతో కప్పివేశారు.

వెనుకనుండి ఒంటెలూ, గుఱ్ఱాలూ మంచి అలంకరింపులతో నడచివస్తున్నాయ్. వాటి వెనుక పల్లకీలో స్త్రీసమూహమంతా ఘోషాపద్ధతిలో వస్తున్నారు.

అలా ఆ ఊరేగింపు బంగళాలో ముట్టిం తరువాత పెళ్లికొడుకుని అమాంతంగా స్త్రీల గుంపులోకి తీసుకెళ్ళారు. స్త్రీలంతా అతని చుట్టూ గుమిగూడి పరిహాసా లాడ్డం మొదలెట్టారు.

ఆ పరిహాసాలతో - నవ్వింపులతో ఇల్లంతా పిక్కటిల్లిపోతూంది. జమీలా యీగుంపునంతా ఛేదించుకునివచ్చి తిన్నగా వెళ్లి, పెళ్లికొడుకుముందరే కూర్చుని అలా అతన్ని ఓ వింతమృగాన్ని చూసినట్లుగా చూడ్డం ఆరంభించింది. అప్పుడో ముసలవ్వ సంప్రదాయసిద్ధంగా తనకు అలవడిన ఒకలాటి వెటకారంతో, పూలసరాల్లో మరుగుపడిన పెళ్ళికొడుకు ముఖాన్ని కాస్త పైకెత్తుతూ, "మనపెళ్లికొడుకు ముఖం చంద్రబింబంలా ఎంత అందంగా వుంటుందో చూశారా?!" అని కిలకిల నవ్వుతూ అందరికీ కనపడేలా పూలతెరని పక్కకి తోసింది. ముఖం పైకెత్తి ఓ చిఱునవ్వు నవ్వాడు పెళ్ళికొడుకు. వెంబడే, అక్కడ పోగయిన ఆడమురా అంతా గొల్లుమని నవ్వుతూ "ఎంత అందగాడే; మన రజియా మొగుడు అచ్చం మదనుడిలా వున్నాడ"ని పొగుడుకున్నారు. అయితే ఆ పెళ్లికొడుకును చూట్టంతోనే జమీలాకు బలవంతంగా విద్యుత్తీగెలు పట్టుకున్నంతగా షాక్ తగిలింది. దాంతో పాపం, ఒళ్ళు ఒణికిపోయింది. పెళ్ళికొడుకు వాస్తవానికి ముదివయస్సులో, అమ్మవారు చుక్కలతో వికారంగా, వికృతంగా వుండేటి ముఖంతో అపరమదనుడిలానే వున్నాడు! జమీలా అట్టే ఎక్కువసేపు చూళ్ళేక, తన తల్లి దగ్గిరికి పరుగెత్తింది. "అమ్మాయ్! రజియా అక్కయ్య అతగాణ్ణి పెళ్లిచేసుకోకే! అబ్బబ్బా! అత నంత అసహ్యంగా వున్నాడేమా— పుట్టిముసలిదెయ్యం... నాకు అమ్మ చెప్పే కథల్లో పెళ్లికొడుకులంతా అందంగా, నడివయస్సులో వుంటారుటగా? ..."అని యింకా యేమేమో అనబోయే సరికి వాళ్ళమ్మ వెంటనే జమీలా నోరు కట్టేసింది.

"అలాగంతా అనడం తప్పుతల్లీ! అత నెంతో అందంగా వున్నాడు....ఆ తరువాత పెళ్ళాడబోతూండడం మీరజియా అక్కయ్యగాని నువ్వు కాదుగా?! నీకెందుకా గొడవ...నీకు పెళ్ళయ్యేప్పుడు మాత్రం మంచి ఎర్రగా, బుర్రగా వుండే నవాబు కుఱ్ఱాణ్ణి వెదికి తెద్దాంగాని, ఇప్పుడూరుకో. వెళ్లు. ఆపిల్లల్తో కులాసాగా ఆడుకోరాదూ? మీకందరికీ తరువాత తీపి తీపి మిఠాయి పంచిపెడతాగాని..."అని అంది వాళ్ళమ్మ.

రెండు నిమిషా లనంతరం జమీలా మిఠాయితీపిలో, ఆ సంగతంతా విస్మరించింది కాలచక్రం గిర్రున తిరిగింది. రజియా పెళ్లయిన ఒకే సంవత్సరంలో గర్భంధరించడం, నెలలు తిరక్కమునుపే ఆ శిశువు గర్భంలోనే చనిపోవడం అవీ వరుసగా జరిగాయి.

కాలవాహినిలో మరికొన్నేళ్లు వడివడిగా కొట్టుకు పోయాయి...జమీలా యిప్పుడోక ప్రఫుల్లిత కుసుమం. మిసమిసమనే నవయౌవనంతో తొణికిసలాడుతోంది. పిల్లతనంలో జరిగిన సంఘటనలన్నీ క్రమంగా

(28 వ పేజీ చూడండి)




ఎండ ఎక్కుతున్న కొద్దీ అంతా నిద్దర్లకు పడ్డారు. ప్రయాణపు బడలికా, ఇంటినుంచి బయలుదేరినప్పటి నుంచీ కలిగిన మానసిక సంక్షోభమూ వల్ల మామ అందరికన్న ముందే కన్ను మూశాడు. కాని మామకు సుఖమైన నిద్ర పట్టలా. ఇంటినిండా ఏమిటో దిక్కుమాలిన చప్పుళ్లూ, కేకలూ, అరుపులూ, రేడియో మోతా, రోడ్డుమీద మోటార్ల హారన్ చప్పుళ్లూనూ. ఎన్నడూ కలలు ఎరగని మామకు ఇవాళ ఒకటే కలలు – పీడకలలు. అందులో రకరకాల పిల్లులు. ఒక మచ్చల పిల్లి తనదగ్గిరికి వచ్చి ముద్దు పెట్టుకున్నట్టూ, తనకా పిల్లిమీద మోహం కలిగినట్టూ, ఇంతలో అది నోరు భయంకరంగా తెరిచి తనను మింగబోయినట్టూ, ఒక కల వచ్చింది మామకు. ముచ్చెమటలు పోశాయి. వణుకుతూ నిద్రలేచాడు.

"ఏం, మామా? ఇంకా నీకు పొద్దూ 'లా?" అన్నది ఒకపిల్ల.

'ఇంత వెలుతురుంటేనే?" అన్నాడు మామ కళ్లు చికిలిస్తూ.

మేనగోడలు నవ్వి, "ఇది ఎలెక్ట్రిక్ దీపాల వెలుతురు లే, నిద్రలే, కాస్సేపట్లో అందరం బయలుదేరుతున్నాం," అన్నది

"ఎక్కడికి?" అన్నాడు మామ.

"ఎక్కడి కేమిటి? పట్నంమీదికి"

మామకు ఆకలేస్తున్నది చెల్లెలికోసం వెతికాడు చాలామంది ఒక మూలచేరి అవీ ఇవీ తింటున్నారు.

**శ్రీ కొడవటిగంటి కుటుంబరావు**

"ఏం కావాలన్నయ్యా? ఇది మధ్యాన్నం ఎవరో మనింటికి వస్తే తెప్పించిన బజ్జీ. పనిచేసే లక్ష్మమ్మ బద్ధకస్తురాలు. దగ్గరహోటల్లో తెచ్చింది. ఇంకా నాలు గడుగులు వేస్తే మంచిహోటలున్నది. ఎన్నిసార్లు చివాట్లు పెట్టినా అది వినిపించుకోదుగా. పనివాళ్ల కెంత పొగర నుకున్నావేమిటి?" అన్నది చెల్లెలు.

తన చెల్లెలు, ఇంట్లో అద్దెకున్నవాళ్ళ పక్షాన మాట్లాడుతున్న సంగతి మామకు చప్పున అర్థంకాక, "ఎవరన్నా వస్తే నన్ను లేపకపోయినావుటే?" అన్నాడు.

పిల్లలంతా గొల్లున నవ్వారు.

పకోడీలూ, అరిటికాయవేపుడు ముక్కలూ, అప్పడంతునకలూ, కుళ్ళిపోతున్న ఉల్లిపాయితొక్కలూ, సగం పండిన మిరపకాయముక్కలూ, ఇంకా ఏమేమిటో తినటానికున్నాయి. మామ వాటిని బలవంతాన మింగాడు

తన చెల్లెలి కుటుంబంగురించి మామకు ఇప్పుడు అనేక కొత్త విషయాలు తెలియసాగాయి ఎవరి మాటా ఎవరూ వినిపించుకోరు "నా యిష్టం," అనేమాట ప్రతినోటా, ప్రతిక్షణమూ వినిపిస్తుంది. ప్రతిదానికీ ఒకరినొకరు తీవ్రంగా విమర్శించుకుంటారు. వాళ్లు ఉదయం తనదగ్గిర తమ సహజధోరణి దాచిఉండాలి. ఇప్పుడు తాను పాతపడ్డాడు. వాళ్ల మధ్య ఉన్న అసలు సంబంధాలు బయటపడుతున్నాయి.

పట్నంబావ తల్లి, బహువృద్ధు. ఇవాళో రేపో అన్నట్టున్నది. ఆవిడవిషయం ఎవరూ ఆలోచించరు. ఆవిడ కేంకావాలో ఎవరూ కనుక్కోరు

"ఏమండీ, అత్తయ్యగారూ! పెద్దవారై పోయినారు," అన్నాడు మామ, ఆ ముసలావిడదగ్గిరికి చేరి.

"ఏదో, ఇంకా నూకలు చెల్లక మిగిలి ఉన్నాను...వాళ్ళంతా సుఖంగా ఉంటే చాలు. నా మాటకేం?" అన్న దావిడ.

"వాళ్లు మీకు సరిగా ఉపచారాలు చేస్తారా ?"

"ఉపచారాలా ! ముసలిముండ ఇంకా పోదేమా అని చూస్తున్నారు. చూపట మేమిటి? పైకే అంటారు. ఇన్నేళ్లు బతక రాదుట – మా చిట్టి అంటుంది. ముసలాళ్లను రోజూ చూస్తుంటే అన్నం సయించదుట, ఆరోగ్యం చెడుతుందిట! లోకంలో అంతా నవయువ్వనులే ఉండి కన్నూ, మిన్నూ కానకుండా టింగురంగా అని తిరగాలిట. నాయనా, ఇట్లా మారింది కాలం. నా చిన్నతనంలో ఎటువంటి ఆపేక్షలుండేవి! ఎటువంటి అంతఃకరణలుండేవి! ఇప్పుడు మొగుడూ పెళ్లాలకు పడదు. తల్లీ కూతుళ్లకు పడదు. అన్నాదమ్ములకు పడదు. ఎంతసేపూ, నేనూ, నాదీ!"

ముసలావిడ చెప్పినదాన్లో అతిశయం ఏమీ లేదనుకున్నాడు మామ. తన చెల్లెలి కూటంలో వయసుకూ, అనుభవానికీ బొద్దింక కాలి గోరు విలవలేదు. పై పెచ్చు కుర్రకారువాలకం చూస్తే ఎంత చిన్నవాళ్ళయితే అంత తెలివిగలవాళ్ళనీ, ఎంత అనుభవం లేనివాళ్ళయితే అంత వివేకవంతులనీ అన్నట్టుంది.

"ఇదంతా మంచికిమటుకు రాలేదు," అనుకున్నాడు మామ.

"ఏం, బావా ? తిండీ తిప్పలూ అయిందా? మనం అట్లా పార్కుకు పోదాం," అన్నాడు పట్నంబావ, మామతో.

పార్కంటే ఏమిటో మామకు తెలీదు. అక్కడేముంటుందని అడిగాడు మామ.

"అక్కడ మంచి దీపాలూ, చెట్లూ, మొక్కలూ అవీ ఉంటాయి. ఎనిమిదంటికల్లా పార్కు తలుపులు మూస్తారు. ఆ తరవాత మనవాళ్లు చాలామంది చేరతారు. చాలా విషయాలు మాట్లాడుకోవచ్చు. ఇంకా పైముందిలే," అన్నాడు పట్నంబావ.

ఆరుబయట చెట్లు చామలమధ్య తిరిగి ఎన్నో ఏళ్లయినట్టుగా ఉండి మామ పార్కుకు పోవటానికి ఉబలాటపడ్డాడు.

ఇదే సమయంలో అందరూ ఒక్కసారి గొల్లుమన్నారు. మామకు గుండె ఆగిపోయినట్టయింది. ఆ క్షణానే మామకంటికి చిట్టి గోచరమైంది. దాని మూతంతా నెత్తురు!

"ఏం జరిగిందే? ఏం కొంపమునిగిందే!" అంటూ మామ ముందుకు వచ్చాడు.

అంతవరకు గొల్లుమంటున్నవాళ్లు మామ కేసి ఆశ్చర్యంగా చూశారు. వాళ్లు గొల్లుమన్నది భయాందోళనలతో కాదని వెంటనే మామ అర్థం చేసుకున్నాడు.

"ఏమిటన్నయ్యా? ఎందుకట్లా కంగారు పడుతున్నావు?" అన్నది చెల్లెలు.

"దాని మూతి! ఆ నెత్తురు!" అన్నాడు మామ. ఆయనకు నడివీధిలో ఉన్న పందికొక్కు మళ్లీ కళ్ళెదట కనిపించినట్టయింది.

మామమాటలకు మళ్ళీ అందరూ గొల్లుమన్నారు.

"వీళ్లు నవ్వొచ్చినప్పుడల్లా ఎందుకిట్లా గొల్లుమని గుండె బేజారు చేస్తారో!" అనుకున్నాడు మామ.

"అది నెత్తురు కాదన్నయ్యా! లిప్‌స్టిక్కు! బయటికి పోవాలన్నప్పుడల్లా ఈ ముండ ఎట్లా సంపాదిస్తుందో ఆ లిప్‌స్టిక్కు సంపాదిస్తుంది. ఏనాడైనా అది దొరక్కపోయిందో అది బయటికి పోదు," అన్నది తల్లి, తన కూతుర్ని చూసి గర్వపడుతూ.

"ఎందు కదీ ?" అన్నాడు మామ.

"ఎందుకేమిటి? అందానికి," అన్నది చెల్లెలు.

మూతి ఎవరో చితకగొట్టినట్టు చేసుకోవటంలో అందమేమిటో మామకు అర్థం కాలా.

"అది కాదు, మామా !" అన్నాడు బాలుడు ముందుకొచ్చి, ఏదో బయట పెట్టబోతున్న వాడి మొహం పెట్టి.

"ఒరే, బాలాయ్, నీ గుండెలు తోడుతా – అనవసరపు మాటలు మాట్లాడావంటే!" అన్నది చిట్టి.

"పోవే, నువ్వంటే లెక్కేమిటీ!... అది కాదు, మామా. ఈ లిప్‌స్టిక్ దీనికెవరు నేర్పారో తెలుసా? అవతలివీధిలో ఒకతె ఉంది. చిట్టికి అదంటే గొప్ప. రోజూ సినిమాలకు పోవటం, అడ్డమైన స్నేహాలూ మరగటం, తెల్లగా తెల్లారి ఇంటికి రావటం చిట్టి కదే నేర్పింది. అది, అమ్మో, కాలాంతకురాలు. అది మూతికే కాదు గోళ్లకూ రంగేస్తుంది. వొంటినిండా పౌడరు వేసుకుని అంతదూరంనుంచి గుమాయిస్తూ ఉంటుంది. బలే కిలాడీ! –"

"పౌడ రేమిటి?" అన్నాడు మామ.

"తెల్లటి పొడి. అది వేసుకుని తాను తెల్లఎలికలాగా ఉన్నాననుకుంటుంది–"

"ఎందుకు తెల్లగా ఉండటం ?" అన్నాడు మామ.

"తెల్లఎలిక అని అందరూ అనుకుంటే గొప్ప కాదు, మామా ?"

"తెల్లఎలికేమిట్రా, నీ మొహం !" మళ్లీ అందరూ గొల్లుమన్నారు.

"నీకు తెలీదుగామాలు. తెల్లఎలికలున్నాయిలే. యుద్ధం జరిగినప్పుడు విదేశీ సిపాయీలు కొన్నిటిని పట్టుకొచ్చారు. అందులో ఒకదాన్ని ఈ ముండ బుట్టలో వేసుకుని నలుగురు పిల్లల్ని కూడా కన్నది. అందులో రెండు ఆడపిల్లలు తెల్లవీ, రెండు మగపిల్లలు నల్లవీనూ. ఆ తెల్లఆడపిల్లలంటే దానికి తగని ఇష్టం. మగపిల్లల్ని చూసేదే కాదు. చివరకు దానికి తగ్గశాస్తిఅయిందిలే. ఆ తెల్లపిల్లలు కాస్త పెద్దయినతరవాత తల్లిని ఎంత నీచంగా చూడాలో అంత నీచంగా చూశారు. వాళ్లకెంత పొగరు! మా నల్లవాళ్లు అంటరాదుట. తెల్లవాళ్లకోసం వెతుక్కుంటూ వెళ్లారు. ఏమైనారో తెలీదు."

మామ ఈ కథ విని నమ్మలేకపోయినాడు. బాలుడు ఇంకా చెప్పుకుపోయినాడు.

"చిట్టీ అదీ కలిసి సినిమాచూస్తారు. ఆ తరవాత తిండీ తిప్పలూ వెతుక్కుంటారనుకున్నావా? పెద్ద దుకాణాలు కొల్లగొట్టటానికి బయలుదేరుతారు. వాళ్లకెంతసేపటికీ పౌడర్లూ, స్నోలూ, లిప్‌స్టిక్కులూ, క్యూటెక్సులూ –"

"మా యిష్టం పో !" అంటూ చిట్టి గిరుక్కున తిరిగి ఎటో వెళ్ళిపోయింది.

"మనకు వేళయింది. పోదాం పద, బావా !" అన్నాడు పట్నంబావ.

## 6

మామ పార్కును చూసి ఆశ్చర్యపడ్డాడుగాని ఆనందించలేదు. అక్కడి మొక్కలు చూసి మామ నిరాశకూడా చెందాడు. ఒక్క మొక్క మామకు పరిచితమైనది కాదు. ఒక్కదాని వాసనా, రుచీ మామకు నచ్చలేదు.

"ఇవి అందంకోసం వేసినవి, బావా,

వీటివల్ల వేరే ప్రయోజనం ఏమీలేదు," అన్నాడు పట్నంబావ.

ఒకచోట కొందరుచేరి కబుర్లు చెప్పుకుంటున్నారు. తాను కొత్తవాడు గదా అనుకుంటే పట్నం బావనుకూడా వాళ్లు పలకరించలేదు. అయినా ఎరిగిన మొహాలై ఉండాలి; పట్నంబావ వాళ్లకేసి దారి తీశాడు.

"మీరేమైనా చెప్పండి, ఇవాళ జానపద చిత్రాలు తియ్యకపోతే ప్రొడ్యూసర్లు మట్టికొట్టుకు పోవలసిందే!" అన్నదొక లావుపాటి ఎలిక.

"ఇవెంత కాలం ఉంటాయో, చూస్తాంగా?" అన్నది మరొక సన్నని ఎలిక.

"ఇవి పోతే యింకో రకం పిక్చర్లు వస్తాయి. మునిగిపోయిం దేమీ లేదు," అన్నది పొట్టితోక ఎలిక.

"ఏమైనా మార్పు మంచిదే. నా చిన్నతనంలో దిక్కుమాలిన పౌరాణిక చిత్రాలు చూసేవాళ్లం. ఆ తరవాత సాంఘిక చిత్రాలన్నారు. ఇప్పుడు జానపద చిత్రాలంటున్నారు. ఈ విధంగా పిక్చర్లు మారుతుంటే తారలుకూడా కొత్తవాళ్లు రావటానికి వీలవుతున్నది," అన్నదొక గూని ఎలిక.

"నాకు మరేం అభ్యంతరం లేదుగాని ఈ జానపద చిత్రాలు చాలా అవినీతిని ప్రేరేపిస్తున్నాయి. నెన్నా గున్నదన్నమాటే గాని -" అని మరొక ఎలిక అందుకున్నది.

ఈ సంభాషణలోకి పట్నంబావ ప్రవేశించాడు.

"ఏమైనా, ఆ వెనకటి పౌరాణిక చిత్రాలతో ఇవేవీ పోలవు లేద్దురూ! ఎంత హాయిగా ఉండేది అవి చూస్తుంటే," అన్నాడు పట్నంబావ.

"చిత్రాల్లో నీతి ఉండాలి. ఈ ప్రొడ్యూసర్లు డబ్బుదాహంతో తుక్కుచిత్రాలు తీస్తున్నారు మరీనూ!" అన్నది మొదటి ఎలిక.

"అయితే చూడండి, నాయన్లూ, మీరు ఏం మాట్లాడుకుంటున్నారో నాకేమీ అంతు బట్టటంలేదు". అన్నాడు మామ నిస్సంకోచంగా.

పట్నంబావ మాట్లాడితే ఆశ్చర్యపడని వాళ్ళు బైతుమామ మాట్లాడేసరికి కొయ్యబారినట్టయిపోయినారు.

"మేం సినిమాలను గురించి మాట్లాడుతున్నాం," అన్నది లావుపాటి ఎలిక. "ప్రొడ్యూసర్లు తమకు ఎక్కువ లాభం వచ్చే పిక్చర్లు తీస్తారా? మనం కావాలన్నవి తీస్తారా? మీరే చెప్పండి, తాతగారూ!"

తన యీడు ఎలిక తనను తాత అనేసరికి మామ ఒక్కసారి చకితుడైనాడు.

"ఎవరి లాభంకోసమో నువ్వారాటపడతా వెందుకు పోనిస్తూ. ఇంతమందీ తీరిగ్గాచేరి కూటికిగాని పోచికోలుకబుర్లు చెప్పుకోటానికేనా ఈ పార్కు పెట్టింది? చాలు, చాలు! ఎవరన్నావింటే నవ్విపోతారు." అన్నాడు మామ, మందలింపుగా.

మిగిలిన ఎలికలకు కోపంవచ్చి మామను ఢడామడా నాలుగు మాటలూ అన్నారు.

"ఇది పబ్లిక్ పార్కు! మా ఇష్టం వచ్చింది మేం మాట్లాడుకుంటాం. అచ్చగా తిండి గురించే పొద్దస్తమానం మాట్లాడుకునేటందుకు మేం పల్లెటూరి బైతులంకాం. మాకు కళలో ఆసక్తి ఉంది. మేం ఉన్నత సంస్కారం కలవాళ్ళం,"అన్నారువాళ్లు.

"మీ ఉన్నత సంస్కారం ఏడిసినట్టే ఉంది. ఎవరి సంస్కారమో తెచ్చి నెత్తినేసుకుని, ఎవరి సమస్యల్ని గురించో కిందామీదా పడుతూ - వెధవ జీవితాలూ, మీరూనూ!" అన్నాడు మామ, ఎట్టివాళ్ళనైనా మందలించే అధికారం కలిగిఉన్న ధీమాతో.

"ఏమిటి, మా కీ పీడ!" అని వాపోయింది బక్కచిక్కిన ఎలిక.

"పోదాం పద బావా," అన్నాడు పట్నంబావ, ఇక అక్కడ ఆట్టేసేపు నిలవటం భావ్యంకాదని గ్రహించి.

ఇవతలికి వచ్చిన తరవాత పట్నంబావ మామకు బస్తీ పద్ధతులను గురించీ, మర్యాదలను గురించీ చెప్పటానికి ప్రయత్నించాడు. బస్తీలో అట్లా ఒకరిజోలికి ఒకరు పోరు. ఊసుపోకకోసం నలుగురూ చేరినప్పుడు లోక వ్యవహారాలన్నీ మాట్లాడుకుంటారు. వాటి నెవరూ విమర్శించరు. పనికిమాలిన విషయాలను గురించి ఎంత బాగా తెలిస్తే అంత లోకజ్ఞానం ఉన్నట్టు.

ఈ సిద్ధాంతాలను మామ ససేమిరా ఆమోదించలేదు. ఇదేం సంఘ మన్నాడు. తనకుమాలిన ధర్మం ఏమి టన్నాడు. కష్టపడి పనిచేసే ఎలికకు పోచికోలు కబుర్లు చెప్పే అవకాశ మెక్కడఉంటుందన్నాడు.

ఇద్దరూ కలిసి అంతదూరం పోయేసరికి అక్కడ మరొక జట్టుచేరి మాట్లాడుకుంటున్నారు. వారిదగ్గరికి పోవటం పట్నంబావకు మంచిదికాదని తోచింది. కాని మామ వాళ్ళవేపే దారి తీశాడు.

ఈ కిందివిధమైన సంభాషణ వారి చెవుల పడింది.

"ప్రస్తుతంగల రాజకీయ సమస్యల్లో మనకు అతి ముఖ్యమైనది అధికాహారోత్పత్తి సమస్య అనటానికి సందేహం లేదు."

"నా చిన్నతనంలో ఇంత తిండి కొరత ఎరగం. రాత్రివేళ ఎటుపోయినా తట్టల కొద్దీ ఆహారం దొరికేది. నా అనుమానం ఈ ఆహార కొరత రేషనింగువల్ల ఏర్పడుతున్నదని."

"అట్లా అనకు లే. రేషనింగు లేకపోతే పంటలు పండేచోట ఆహారసమృద్ధి ఉండొచ్చుగాక. ధనికుల ఇళ్ళల్లో ఆహారం పుష్కలంగా ఉండొచ్చుగాక. ఈ మహాపట్నంలో మనలో చాలామందిమి మాడి చచ్చేపోతాం."

"నువ్వంతా కంగారు కబుర్లు చెబుతావు! మా ఇంట్లో రోజూ దొంగబియ్యం కొంటారు. రేషనింగు పోవలసిందే!"

"నువ్వు ధనికవాదం చేస్తున్నావు. మన జాతిలో అధిక సంఖ్యాకులు బీదలకొంపల్లో తల దాచుకుంటున్నారు. గాని ధనికుల కొంపల్లో కాదు. నాకు బాగా జ్ఞాపకం. నా స్నేహితు డొకడు చాలా గొప్పవాళ్ళ ఇంట్లో ఉండేవాడు. ఎవరమూ తినని వెన్నలూ, రొట్టెలూ, ఆమ్లెట్లూ, మాంసాలూ తాను తింటున్నాననీ, బీరూ, విస్కీ, షాంపేన్ తాగుతున్నాననీ కోసేవాడు. అక్కడ వదిలి రారా అంటే విన్నాడు. కాడు... వాణ్ణి విషంపెట్టి చంపేశారు వాడికోసం ఎన్ని పన్నాగాలు పన్నారో చెప్పలేం. ఆఖరు రోజుల్లో వాడు వెర్రెత్తిన వాడల్లే మృత్యుదేవత పిలుపు ఆలకిస్తున్న వాడల్లే కనిపించేవాడు. తరిచి తరిచి అడగగా, 'ఇవాళ మీసం వాసిలో చావు తప్పింది. మొన్నో రోజున కూడా చావుతప్పి కన్నులొట్ట పోయింది.' అని బయట పెట్టాడు. ఆఖరుకు చావనే చచ్చాడు. ఎన్నయినా చెప్పు అమాయిక పేద ప్రజలే మన మిత్రులు."

"ఎన్నయినా చెప్పు ఈ రోజుల్లో ఆహారం కనిపించటం లేదు. తినటానికి వెనక ఎన్నడూ కని పించనంత సాహిత్యం మాత్రం కనిపిస్తున్నది. నే నిప్పుడు చాలా వరకు దానిమీదే ఆధారపడు తున్నాను."

"ఆఁ, దాన్ని సాహిత్యమని కూడా అంటావేమిటి? పత్రిక లేగా? వెనక పుస్తకాలుండేవి. వాటిని భద్రంగా దాచేవాళ్లు. కష్టపడి కొంచెమే రుచి చూసినా ఉల్లాసంగా ఉండేది."

(29 వ పేజీ చూడండి)




## 7

ఎండ క్రమంగా తీక్షణ మౌతున్నది. ఒకదానినంటి ఒకటి ఎడంలేకుండా ఇళ్లూ, మేడలూ ఉన్నప్పటికీ, తగినంత మంది జనంలేక, దుర్గయ్యామేడ అన్నిటి మధ్యనూ బిక్కుబిక్కు మంటున్నది. మాధవరావు పోలీసుల అనుమతిపైన దుర్గయ్యతో మాట్లాడ్డానికి వెళ్ళాడు. గదిలో దుర్గయ్య పడక కుర్చీలో కూచుని కిటికీ లోనుంచి ఆకాశంవంక చూస్తున్నాడు. మాధవరావు ప్రవేశించగానే దుర్గయ్య ఒకసారి అతనివంక చూసి, తిరిగి ముభావంగా దృష్టిని కిటికీవైపు మళ్లించాడు. మాధవరావు కొద్ది దూరంలో కుర్చీ లాక్కుని కూచున్నాడు. కొంతసేపటివరకూ ఎవరూ మాట్లాడలేదు. దుర్గయ్య నిష్ఠురమూ, కోపమూ ఉదాసీనతా కాని అదొక వింత భావంతో అన్నాడు. "ప్లీడరుగారూ మీకు చాలా శ్రమయిచ్చాను. నేను చేసిన యత్నమంతా వృథా అయింది. మూడురోజుల క్రిందట నేను అన్ని చిక్కులూ గడిచానని సంతోషించాను. కాని అనుకున్నంతసేపు పట్టలేదు. అంతా పేకఇల్లులా కూలిపోయింది. ఇంక నాకు జీవించాలనే కోరిక చచ్చిపోయింది. కేసులో నేను నేరం ఒప్పుకోవాలని నిశ్చయించుకున్నాను. తెలిసే హత్యకు దిగినట్లు చెప్పదల్చుకున్నాను. ఇంటి గుట్టంతా వీధిని పడ్డం నా కిష్టంలేదు. వీధిన పడ్డాక నేను బతకలేను. అందువల్లనే ఈ నిశ్చయానికి వొచ్చాను. మీరు పడినశ్రమకు తగిన ప్రతిఫలం ఇస్తాను. ఇప్పుడే చెక్ రాసి ఇస్తాను."

మాధవరావు కొంతసేపు సమాధానం చెప్పలేదు. తరవాత మెల్లిగా అన్నాడు "సరే, అలాగే ఇవ్వండి. కాని మీ రిలా ఎందుకు మారిపోయారు? కేసు మీపైన రుజువుకాదని నాకు గట్టి నమ్మకం. మీరు విడుదలౌతారు - గట్టిగా పనిచేస్తే. అదీకాక మీ తమ్ముణ్ని హత్యచేసినవారెవరో, అలా ఎందుకు జరిగిందో తెలుసుకోవాలని మీకు తోచడంలేదా?"

"మొన్నటివరకూ తెలుసుకోవాలని ఉన్నమాట నిజమే. కాని అదంతా నిష్ప్రయోజనం."

"ఎందువల్ల?"

"ఏమో నాకు తెలియదు. పైగా నిజంగా నాకు తెలియకుండా ఈ ఘోరం నేనే చేశానేమో!"

"మీరు చెయ్యలేదని నాకు రూఢిగా తెలుసును. ఇదంతా జరపడానికీ, దోషం మీపైన ఆరోపించడానికీ, మీకు అతి సన్నిహితులైనవారిలో ఎవరో కారకులున్నారు. వాళ్లకి మీ లోపాలు పూర్తిగా తెలుసును. మీ కుటుంబ విషయాలు పూర్తిగా తెలుసును. కాని ఎవరో గ్రహించడం కష్టంగా ఉంది. మీకెవరిపైనా అనుమానం లేదా?"

"లేదు. ఎవరిని అనుమానించడానికీ ఆస్కారం లేదు. నా తమ్ముణ్ని చంపాలని ఎవరికీ ఉండదు. దానివల్ల ఎవరికీ ఎట్టి ప్రయోజనం కలగదు. నాభార్యను చంపడానికి ఎవరైనా ప్రయత్నిస్తే, అది నేనే అయివుండాలని అందరూ అనుకుంటున్నారు. వాస్తవంకూడా ఆమెను చంపడానికి ఏ అవసరంకాని ప్రయోజనం కాని ఎవరికీలేదు. ఈవిషయంలో రూఢి అయినదెంతో రూఢికానిది అంతా ఉంది. ఇది ఎవరివల్ల జరిగిందో తెలియదు. కాని వారు తప్పటడుగు వేశారని మాత్రం చెప్పగలను. ఒక గుండెలో దిగవలసినకత్తి,మరొక గుండెలో దిగింది. అందువల్లనే ఎవరైనదీ ఊహించడం కష్టంగా ఉంది."

"పోనీ నేనొక టడుగుతాను దాచకుండా చెప్తారా?"

"ఇప్పుడివన్నీ తవ్వుకుని లాభంలేదు ప్లీడరుగారూ. మీరేది అడగబోతున్నారో అది నాకు తెలుసు. అది నా నోటితో చెప్పినందువల్ల నాకు బాధేకాని ప్రయోజనం లేదు.

"అందుకని నిష్కారణంగా ఒక ద్రోహినికాపాడి మీ సంసారంలో నిప్పులు పోసుకుంటారా?"

"నా సంసారంలో నేను నిప్పులుపోసుకోనక్కరలేదు. నాకింక సుఖంలేదు. ఆడది ఎప్పుడైతే భర్త ఆస్తికోసం కుట్ర పన్ని, పరాయివాడితో కలిసి అర్ధరాత్రివేళ పేటలుదాటి వెళ్లిందో అప్పుడే ఆసంసారం నాశనమైపోయింది." దుర్గయ్య కింక నోటి వెంట మాటరాలేదు. దుఃఖం, రోషం పొంగివచ్చినాయి.

మాధవరావు నిశ్చేష్టుడైనాడు. కొంతసేపు మౌనంగా కూచుని, తరవాత మెల్లిగా లేచివెళ్లి పోయాడు.

ఇప్పుడతనికి అర్థమయింది. సత్యనారాయణ అర్ధరాత్రివేళ అంకరాజింటికి వెళ్లిన విషయాన్ని దుర్గయ్య తన దగ్గర దాచిన కారణం తెలిసింది. కాని ఆమె ఆ రాత్రి రహస్యంగా ఎందుకు వెళ్లింది?

హాల్లో కమల దీనంగా అలమారు వంక చూస్తూ కూచుంది. మాధవరావు ఒక కుర్చీలో కూలబడ్డాడు.

మెల్లిగా అడిగాడు "కమలా మీ అత్త సత్యనారాయణతో కలిసి ఆ రాత్రి అంకరాజింటికి వెళ్లినట్లు 'నువ్వైనా నాకెందుకు చెప్పలేదు? 'మీ మామని కాపాడాలని నీకు లేదా?"

"కాదు, మామ అంతు పెట్టాడు."

"మీ అత్తనడవడి మంచిది కాదా?"

"మంచిదే. నాకా అనుమానం ఎప్పుడూ లేదు. మామకి మాత్రం చాదస్తంవల్ల అనుమానం ఉండేది. అందువల్లే ఆమెని చంపడానికి ఎత్తువేసి నిద్రలో నడుస్తున్నాడని అందరూ అంటే, నేను నోరుమూసుకో వలసి వచ్చింది."

"ఆమె నడవడి మంచిదని నీకెలా నమ్మకం?"

"ఆడదాన్ని ఆడది సులువుగా కనిపెట్టగలదు."

మాధవరావు వేళ్లు గడ్డాన్ని మీటుతున్నాయి.

"మీ మామకి అత్తమీద అనుమానం కలగడానికి కారణం ఉందా?"

"చాదస్తం"

"కాదు. ఆయన అంత చాదస్తుడు కాడు. ఆధారమేదీ లేదా?"

"మొదట్నించీ అనుమానించేవాడికి ఆధారాలే దొరకవా? ప్రతీదీ ఆధారమే అవుతుంది."

మాధవరావు అసంతృప్తిగా చూసి ఊరుకున్నాడు. కమల మళ్లీ అన్నది.

"మొదట రామచంద్రరావునిగురించి అనుమానించాడు. తరవాత ఆవిడకు పుట్టింటిపైన వుండే మోజునుబట్టి అనుమానించాడు. ఆయనచాదస్తమే ఆయన్నింతవరకూ తెచ్చింది."

"చాదస్తుడైన మనిషి ద్వేషాన్ని కాని మరే ఆవేశాన్ని కాని అణుచుకోలేడు."

కమల ఆలోచించింది.

"ఒక రోజున మామ నిద్రలో నడుస్తూ అలమారు తెరిచి కత్తితీశాడు. అత్తకి భయంవేసింది. చడీ చప్పుడూ కాకుండా పక్కింటికి వెళ్లి తలుపుతట్టింది. రామచంద్రరావు ఒచ్చాడు. అతను వొచ్చేసరికి మామ తన గదిలో పడుకుని గుర్రు పెడుతున్నాడు. తలగడకిందనించి కత్తి తొంగిచూస్తోంది. మెల్లిగా ఇద్దరూ కలిసి తలుపుమూసి వస్తుండగా చప్పుడయింది. మామ మేలుకుని ఇద్దర్నీ చూశాడు. అప్పుడు పెద్ద రగడ జరిగేదే. కాని రామచంద్రరావు అనునయించి కూచోబెట్టి, సంగతి చెప్పాడు. అదే మొదలు మామ తాను నిద్రలో నడుస్తున్నట్లు తెలుసుకోవడం. మర్నాడు రాత్రి సరిగ్గా ఆ సమయానికే, మామ అలమారు తీసి కత్తి చేతిలో పట్టుకుని బయలుదేరుతున్న తరుణంలో, రామచంద్రరావొచ్చి చెయ్యిగట్టిగా పట్టుకున్నాడు. మామ పెనుగులాడాడు కాని రామచంద్రరావు పట్టు విడిపించుకోలేకపోయాడు. పెనుగులాటలో మామకి మెలుకు వొచ్చింది. రామచంద్రరావు చెప్పినది నిజమేనని అప్పుడు గ్రహించాడు మామ. రామచంద్రరావుమీద అనుమానం పోయింది. తరవాతనే మామకి అతని మీద గురి కుదిరింది. రామచంద్రరావు మామకి కొడుకులేని లోటు తీర్చాడు."

మాధవరావు సావధానంగా విన్నాడు. విన్న తరవాత ఏదో అడగాలనుకున్నాడు. కొంత తటపటాయించి అడిగాడు. "మీ అత్తకి రామచంద్రరావంటే మంచి నమ్మకమా?"

"నమ్మకమే. కాని అంతకంటె రామచంద్రరావుకి నా మాటంటే చాలా గురి. అందువల్లనే అత్త నామీద అతని కెన్ని చాడీలు చెప్పినా విని ఊరుకుంటాడు."

"సరే అదంతా పోనీ. ఆ రాత్రి సత్యనారాయణతో కలిసి మీ అత్త అంకరాజింటికి ఎందుకు వెళ్లినట్లు?"

"ఆ రోజు పూర్ణిమ కాబట్టి భయంవేసిందని ఆమె సాకు చెపుతోంది. కాని మళ్లీ రాత్రికిరాత్రి తిరిగి ఎందుకు వచ్చేశారో ఇద్దరూ చెప్పరు. వాళ్లు అల్లా రాత్రి వెళ్లినట్లు సాక్ష్యంలో ఒప్పుకోరు. ఆ రాత్రి మామ హాల్లో తచ్చాడుతుండగా చూశానని సత్యనారాయణ అంటున్నాడు. అతనిలా ఏ ఉద్దేశంతో అబద్ధం చెపుతున్నాడో నాకు పూర్తిగా బోధపడటం లేదు. మామయ్యపైన అతనికే ద్వేషం ఉందో తెలియదు. ఈ హత్య తప్పకుండా అతని కుట్రేనని నా అనుమానం. చిన్నమామకూడా పోతేగాని మామ ఆస్తి పూర్తిగా అత్తకి దక్కదని వాళ్ల ఎత్తు కాబోలు. అదే వాళ్లఎత్తైతే నా అంతు చూడ్డానికి కూడా ఆట్టే రోజులు పట్టదు. ఈచిక్కులో నాకెవరూ అండలేరు. ఇప్పుడు రామచంద్రరావు కూడా భయపడుతున్నాడు. ఏకారణంవల్లనో అతన్ని కూడా పోలీసులు సాక్ష్యానికి వేసుకున్నారు. అతను సాక్ష్యమివ్వకుండా ఏవూరైనా పోతానంటున్నాడు. అతను సాక్ష్యం ఇవ్వకూడదని మామ పట్టుదల. అత్తవ్యవహారం పొక్కుతుందని ఆయన భయం అందుకే మామ ఆట్టే విచారణ జరగకుండా నేరంకూడా ఒప్పుకోవాలనుకుంటున్నాడు."

"సరే అయితే. మీ అత్త పరువు కాపాడాలనుకుంటే, మీ మామప్రాణం దక్కదు. నాకు ఇంక ఈ కేసుతో సంబంధం పెట్టుకోడం ఇష్టం లేదు. నేను వెళ్లిపోదల్చుకున్నాను. మీ మనస్సులు మారితే ఇవాళ సాయంకాలంలోగా నాకు తెలియపరచండి. నే వెడుతున్నాను."

మాధవరావు ఒక నిశ్చయానికి వచ్చినట్లు అతని ముఖమే చెప్తోంది. కాని ఆ సాయంత్రం అతను వెళ్ళిపోలేదు. అంకరాజు ఇంటికి వెళ్ళాడు. ఇంటిలో అడుగు పెట్టగానే అంకరాజు గాభరాపడిపోయాడు.

హాల్లో ఒక్క సామాను లేదు. గోడల్ని పటాలులేవు. మేకులూ, బూజూ వెక్కిరిస్తున్నాయి. లోయింటిలో సామాన్లు సర్దుతున్న హడావిడి స్పష్టంగా తెలుస్తోంది. బిందెల్లో కెక్కుతున్న చెంబులు ఒకసారి మోతపెట్టి నోళ్లు నొక్కుకుంటున్నాయి.

మాధవరావుకి ఆశ్చర్యం కలిగింది. "మీతో మాట్లాడాలి, పనుంది."అన్నాడు. ఇష్టం లేకపోయినా నిరాకరించడానికి అంకరాజుకి ధైర్యంలేదు. జంపకానా తెచ్చి వేశాడు కూచోడానికి. ఇద్దరూ కూచున్నారు.

"మీ వ్యవహారం తేలకుండా నే ప్రయాణం కట్టేస్తున్నారే!"

"లేదు. మళ్లీవస్తాను - మా చెల్లెలికి జబ్బుగా వుందట. టెలిగ్రాం వచ్చింది. అందుకని ఇంటికి తాళంపెట్టి వెడుతున్నాను." అంకరాజు తడబడుతూ చెప్పాడు. మాధవరావు అన్నాడు.

"మీరు అలాగే వెళ్ళవచ్చును. దుర్గయ్యగారు మీతో వ్యవహార పరిష్కరిస్తా

(28-వ పేజీ చూడండి)

# శాకుంతలంలోని ఆధ్యాత్మికచింత

ధ్యాత్మిక దేశంలో పుట్టినందుకు మొత్తానికి గట్టిప్రశ్నే అడిగావోయ్'— శాస్త్రిగారి రిమార్కుతో క్లాసంతా ఘొల్లుమంది. చెబ్బోద్దూ, తోటి పిల్లలంతా నావంకే చూస్తూ అదేపనిగా నవ్వుతుంటే ఒట్టి పనికిమాలిన ప్రశ్నే వేశాను కాబోలురా అని అందరిలోనూ చిన్నతనమేసింది.

అయినా ప్రశ్నప్రశ్నగానే వుండిపోయింది నామనస్సులో.

"అదికాదండీ! ప్రయత్నిస్తే యెందుకు జయించలేము? కోపాన్ని జయించటం కూడా ఒక గొప్పేనండీ?" — అన్నాను సందేహాన్ని సమర్థించుకుంటూనే.

అసలుసంగతి యిది. శాకుంతలం సంస్కృత పాఠం జరుగుతున్నది. నిష్కారణకోపంతో దుర్వాసమహాముని శకుంతలను శపించటం ఆనాటి ఘట్టం.

దుర్వాసమహాముని అతిథియై ఆశ్రమంలోకి వచ్చినాడు. "అయ మహం భోః" (నేను వచ్చితిని.) అని తన ఆగమనాన్ని తెల్పినాడు. కాని శకుంతల యీలోకంలో లేదు. పునరావృతమైన విస్మృత విశ్వాసం దంతో, పతినిగురించి ఆలోచిస్తూ అవనత వదనంతో కూర్చున్నది. ఏ మధురభావాలో ఆమెను ఆవరించినవి. అతిథిగా తన యెదుటవున్న మహామునినికూడా గుర్తించలేనిస్థితిలో వున్నది శకుంతల.

కాళిదాసుభావాన్నత్యానికి హృదయం పుల్కరించింది. ప్రేమ యెంత సాధారణంగా, ప్రాకృతికంగా చూపించాడు! నిజమే! ప్రేమ లోకాల్ని మరిపిస్తుంది. ఒక్క కాళిదాసు భావనలోనే కాదు ప్రేమను ఎరిగిన ప్రతివ్యక్తిదృక్పథంలోనూ.

దుర్వాసుడికి కోపంవచ్చింది. తనకు... దుర్వాసమహామునికి... తీరని అవమానం!.. తనకు అతిథిసత్కారలోపం! ముందూ వెనకా ఆలోచించలేదు దుర్వాసుడు. కమండలువులోని జలం మంత్రించి శపించినాడు.

"విచింతయన్తీయ మనన్యమానసా
తపోధనం వేత్సిన మా ముపస్థితమ్
స్మరిష్యతి త్వాం నస బోధితోపిసన్
కథాం ప్రమత్తః ప్రథమం కృతామివ॥"

శకుంతల ఆ శాపంకూడా విననేలేదు!

*  *  *  *

'అవును. కోపం ముందూ వెనుకా ఆలోచించనీయదు. కోపాన్ని జయించటం యెంతటి మహామునులకైనా కష్టసాధ్యమైన పని.'

శ్లోకాన్ని శాస్త్రిగారు వ్యాఖ్యానిస్తున్నారు. ఏ శ్లోకాన్నయినా శాస్త్రిగారు వ్యాఖ్యానించాలి, వినాలి. ఒక్కొక్క శ్లోకాన్ని సవిమర్శగా వ్యాఖ్యానం చేశారూ అంటే భారతమంత గ్రంథం అవాలిసిందే! దానిలోని అర్థాన్నీ, అంతరార్థాన్నీ, ఆధ్యాత్మికతత్వాన్నీ విమర్శించనిదే ఆవాళ పాఠంకానీయరు.

'"కోపంలేని మనుష్యుణ్ణి చూపించండి! ఎంతటి మహానుభావులకైనా యేదో ఒకసమయంలో, యెందుకో ఒకందుకు కోపంరాకుండావుండదు. ఈసందర్భంలో నా కొక పద్యం జ్ఞాపకంవస్తున్నది.

క్రోధమె సంసృతి బంధము,
క్రోధమె హృత్తాపవకగుం గారణ, మా
క్రోధమె ధర్మక్షయకర,
మీధరగావున ద్యజింపు మీవద్దానిన్.

చూచారా కోపం యెంతపని చేస్తుందో? అసలు యీ ఆధ్యాత్మికతత్వం అనాదినుంచీ ఒక్క మన భారతదేశానికే తెలుసు. వేదాలకు ప్రథమ వాక్కయిన ఓంకారంలో యెన్ని పవిత్ర అర్థాలు యిమిడి వున్నవి? శాంతిసందేశాన్ని ఆనాడూ యీనాడూ యివ్వగలిగింది ఒక్క మన భారతదేశమే, కోపాన్ని జయించినవాడు నిజంగా యింద్రియాతీతుడే. అటువంటి మహానుభావులు తరిచిచూస్తే మనచరిత్రలో కొంతమంది కనిపిస్తారు. కాని యీకాలంలోనో? ప్రతిచిన్న విషయానికీ కోపమే, విసుగే.

పప్పులో వుప్పుతక్కువయితే భార్యమీద భర్తకోపం. నగలు చేయించకపోతే భార్యకు భర్తమీదకోపం. చదువుకోమంటే విద్యార్థికి కోపం ప్రశ్నకు సరిఅయిన సమాధానాలుచెప్పకపోతే మీమీద నాకు కోపం. ఆఖరుకు 3 నెలల పసిపాపకుకూడా పాలు పట్టటం ఒక్కనిమిషం ఆలస్యం అయితే కోపం!

'కోపంలేని దెవరికోయ్?

గాంధీగారు శాంతం భూషణమన్నారు. కోపం వద్దన్నారు. అహింసాయుతమైన శాంతిమార్గాన నడవమన్నారు. బుద్ధదేవుడి అహింసాతత్వంలోనూ యీ పరమాశయమే యిమిడి ఉన్నది. ఒకచెంపమీద

దెబ్బ వేస్తే రెండవ చెంప చూపించమనే క్రీస్తు ఉద్బోధనలోనూ యిదే శాంతితత్త్వం ప్రస్ఫుట మవుతున్నది. అంతవరకూ యెందుకు? మీరు రోజూ చదివే ఆంధ్ర పత్రికలో వుంటుందే పద్యం,

ఒరులేయవి యొనరించిన నరవర
యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము
పరమధర్మపథముల కెల్లన్.

ఈ పద్యానికర్థం యేమిటనుకున్నారు? 'ఇతరుల మనస్సును నొప్పించవద్దు. కోపంతో దుర్భాష లాడవద్దు,'- నే నింత వరకూ చెప్పిన పవిత్రతత్వమే యీపద్యం లోనూ ఇమిడివున్నది."

శాస్త్రిగారి ధారాశుద్ధికి అందరం తన్మయులం అయి వింటున్నాం. చటుక్కున నాకో సందేహం తోచింది.

'ప్రయత్నిస్తే కోపం లేకుండా వుండనే లేమా? తప్పకుండా వుండగలము. ఎవరి మాట యెట్లావున్నా, నేను వుండగలను!'

ముందూ వెనకా ఆలోచించకుండా చటుక్కున లేచి అడిగాను శాస్త్రిగారిని.

'కోపం లేకుండా వుండాలనంటే యెందుకు వుండలేమండీ?' పిల్లలంతా నవ్వుతూనే వున్నారు యింకా...

శాస్త్రిగారు గంభీరంగా అన్నారు—

"చూడటానికి తేలిగ్గా కనిపిస్తుంది కాని ఆచరణలో పెట్టటం కష్టసాధ్యమోయ్! అయినా వాదం యెందుకు? నీవే ప్రయత్నించి చూడరాదు? ఒక్క వారం రోజులు— వారంకూడా అక్కరలేదు నాలుగురోజులు— కోపం లేకుండా గడపగలవేమో ఆత్మపరీక్ష చేసుకుని నాకు చెప్పు. పరీక్షలో నెగ్గగలిగితే నీ వొక యుగపురుషుడివని అంగీకరిస్తాను!"

ఖంగుమంటూ గంట మ్రోగింది. శాస్త్రిగారి వాక్యాలు సత్యమేనేమో ననిపించింది. అంగీకారసూచకంగా తలవొంచాను.

ఇంక అక్కడ వుండే బుద్ధి వేయలేదు. పుస్తకాలు పట్టుకుని నేరుగా యింటికి వచ్చేశాను.

* * * *

వేసవికాలమేమో కాఫీ త్రాగి యీజీ చైరులో కూలబడేటప్పటికి ఒళ్లంతా చెమటలు పోసుకొచ్చింది. మర్నాడు కెమిస్ట్రీ పరీక్ష, ఏసిడ్‌లూ (acids) క్లోరైడ్‌లూ (chlorides) జ్ఞాపకం వుండటం లేదు. అప్పటి కప్పుడే యెండ చుర్రుమంటూ పైకి వచ్చింది. పుస్తకం పట్టుకుని చదవటం మొదలెట్టా. పుస్తకంలో పాఠం కన్నా. యింట్లో మాటలు త్వరగా చెవికెక్కుతున్నాయి. నా మేనల్లుడు, ఏడేళ్ళ కుర్రవెధవ లౌడ్ స్పీకర్ గొంతుతో తెగపాడేస్తున్నాడు.

కొండవీడు మనదేరా!
కొండపల్లి మనదేరా!
కాదని వాడుకు వస్తే
కటకందాకా మనదేరా!

యుద్ధానికి పోయే వీరుడిలాగే ఉద్రేకంగా పాడుతున్నాడు.

రక్తనాడులన్నీ ఉప్పొంగినాయి. ఒక్క క్షణం యేదో అర్థంకాని అనుభూతి. ఉద్రేకమే కానీయండి, అభిమానమే కానీయండి గుండెల్లో కరెంటులాగా మెరిసింది. ఆ క్షణంలో నాకు ఏసిడ్‌లూ (acids) ఆల్కలీలూ (alkalies) జ్ఞాపకం లేవు. ఆ క్షణంలో జ్ఞాపకమున్నది- నేనూ ఒక ఆంధ్రుడిననే భావం మాత్రం!

ఇంట్లోనుంచి అక్కయ్య కాబోలు కేక వేస్తున్నది.

'అన్నీ మనవేలేరా వెధవాయ్! అట్లా బజుద్దాయిలా తిరగకపోతే మామయ్య దగ్గరకు వెళ్లి లెక్కలు చెప్పించుకోరాదూ?'

ఈ లోకంలో పడ్డాను. ఈ కుర్రవెధవ నాదగ్గర కెక్కడ వస్తాడోనని గాబరా వేసింది. చేతిలో కెమిస్ట్రీ పుస్తకం తెరచి సీరియస్‌గా ముఖం పెట్టి చదువుతున్నాను.

పలకా, బలపమూ పట్టుకుని వాడు రానే వచ్చాడు.

'మామయ్యా, అమ్మ నిన్ను చదువు చెప్పమంది.'

'ఎవరికి?'- అన్నాను దృష్టిమరల్చకుండానే. అది అర్థం లేని ప్రశ్న అని తెలుసు.

'నాకే మామయ్యా, చదువు చెప్పు, లెక్కలు వెయ్యమంటావా?'

ఎట్లాగూ తప్పదు. వీడు ఒక పట్టాన వదిలేఘటం కాదు. త్వరగా వదుల్చుకుందామని,

'తొమ్మిదిలో నాలుగు తీసివేస్తే యెంతరా?' అన్నాను. వాడు లెక్క వేయటం ఆరంభించాడు. రెండు చేతుల వ్రేళ్లూ మడుస్తూ తెరుస్తూ దీర్ఘంగా ఆలోచిస్తూ నానా తంటాలూ పడుతున్నాడు.

'తొమ్మిదిలో నాలుగు పోతే యెంత?- వాడి చిన్న బుర్రకి యిదే ఒక పెద్ద సమస్య



బుర్రగోక్కుంటూ యింకా ఆలోచిస్తూనే వున్నాడు. నాకు నవ్వు వచ్చింది వాడి అవస్థ చూస్తుంటే.

తొమ్మిదిలో నాలుగు తీసివేస్తే యెంతో కనుక్కోటానికి ఒకప్పుడు నేనూ యిట్లాగే తంటాలుపడ్డాను కాబోలు!

'ఏమిరా?'— కొంచెం విసుగ్గానే అడిగాను.

'తెలియదు మామయ్యా' వాడు జంకుతూ జవాబు చెప్పాడు.

'తెలియదూ? ఏమి తెలుసురా నీకు? నీదగ్గర తొమ్మిది రూపాయలున్నాయనుకో. నాకు నాలుగు రూపాయలు యిచ్చేస్తావు. ఇంకా నీదగ్గర యెన్నిరూపాయలుంటవి? చెప్పు.'

ఇంత తెలివిగా ప్రశ్న వాడికి తెలిపి చెప్పినందుకు న నేనే ఆనందించుకుంటూ జవాబుకోసం యెదురుచూస్తున్నాను.

వాడి కళ్లు మెరిశాయి యెందుకో. తటికుని జవాబు చెప్పాడు.

'నాదగ్గర తొమ్మిది రూపాయలు లేవుగా మామయ్యా? ఉన్నా దాచుకుంటాను కాని నీ కివ్వనుగా?'

తెలియకనే, అమాయకంగానే అని వుంటాడు ఈమాట. కాని, చదువుకు ఆటంకం కలిగిందన్న ఉక్రోషంతో మండిపోతున్న నాకు వీడి జవాబులో కొంటెతనమూ, వేళాకోళమూ స్ఫురించాయి.

కోపంతో ఒళ్లు తెలియలేదు. 'వెధవాయ్, నాతో ఆట ఆడుదామనుకున్నావట్రా?'-అంటూ చెంపమీద యీడ్చి కొట్టాను. వాడు యేడుస్తూ పలకా, బలపమూ అక్కడే పడేసి యింట్లోకి వెళ్లాడు.

కోపం యింకా చల్లారలేదు. విసుగ్గా చేతిలో కెమిస్ట్రీపుస్తకం క్రిందపడేసి యీ జీచైరులో మేనువాల్చాను.

ఇంట్లోనుంచి మాటలు వినిపిస్తున్నయ్-

'మామయ్య కొట్టాడమ్మా'- కంప్లెంటు చేస్తున్నాడు నామీద-

'మరి చదువు సరిగా రాకపోతే కొట్టడూ? ఆటలూ, పాటలూ తప్ప చదువుమీద దృష్టే లేదాయె నీకు!'-అక్కయ్య కూడా నన్నే సమర్థిస్తున్నది.

బాగా యెండెక్కింది. మగతగా పడుకున్నాను.

'అబ్బాయ్! ఒరేయ్ బాబూ, కొంచెం పనిచేసి పెట్టమ్మా'......

ఉలిక్కిపడి లేచాను. ఎదురుగా వాకిట్లో అక్కయ్య నుంచుని వుంది.

'ఏమిటక్కయ్యా'- కెమిస్ట్రీపుస్తకం కోసం క్రిందకు వంగి తడువుకుంటూ అన్నాను.

'కొంచెం పోస్టాఫీసుకు వెళ్లి బావకు టెలిగ్రాం యిచ్చిరా బాబూ.'

నిద్రమత్తు పూర్తిగా వదిలింది. ఒక్క గంతున లేచి 'టెలిగ్రాం యేమిటక్కయ్యా?'—అన్నాను.

అక్కయ్య శాంతంగానే జవాబిచ్చింది. 'ఏమీ లేదురా. నాకు రెండురోజుల్నుంచీ సుస్తీగా వుంటున్నదని వ్రాస్తే బావ గాభరా పడుతూ, ఆఫీసుకి శలవు పెట్టి వస్తున్నానని జవాబు వ్రాశారు. అంతఆదుర్దాపడే విశేషమేమీ లేదు. అనవసరంగా శ్రమ. కులాసాగా వున్నాననీ యిప్పుడు తొందరపడి రావద్దనీ యిచ్చిరా."

'ఇంతే కదా!'......

కుర్చీలో కూలబడి చెమట తుడుచుకుంటూ అన్నాను." నేను చాలా చదువుకోవాలి అక్కయ్యా. రేపు పరీక్షకూడానూ. అయినా బావ వస్తేమాత్రం యేమిటే. రెండురోజు లుండి వెళతాడు."

అక్కయ్య కేమీ నచ్చలేదు నా జవాబు. 'అది కాదురా. ఆఫీసులో శలవు దొరకటం చాలా కష్టం. ఒక పదిరోజుల్లో పండుగ యెట్లాగూ వస్తుంది కదా. అప్పుడే శలవు పెట్టి వస్తారు. ఇప్పుడు అనవసరంగా వచ్చి వెళ్లి మళ్లీ రావలసి వుంటుంది. అందుకని చెప్పుతున్నాను. తర్వాత నీయిష్టం.'- అక్కయ్య గిరుక్కున తిరిగి యింట్లోకి వెళ్లిపోయింది.

ఎటూ తోచక బుర్ర గోక్కుంటున్నాను. అమ్మ యింట్లో పనిచేసుకుంటున్నదల్లా విసురుగావచ్చి అన్నది, 'అక్కయ్య అన్నిసార్లు అడుగుతుంటే కదలవేమిరా? అదేమనుకుంటుంది? మధ్యన నీ ఆలోచన లెందుకూ? పెళ్లయితే నీకూ తెలుస్తుంది సంసారంలోని సాధక బాధకాలు. పోయి అందులో చెప్పిరా. నీ చదువు యెప్పుడూ వున్నదేలే?'

తప్పలేదు. అన్నిటికీ నేనే. ఇటు చదువు సాగకపోయినా యిబ్బందే. అటు ఇంట్లో పనులు చేయకపోయినా తప్పదు.

నా కోపం అంతా కెమిస్ట్రీపుస్తకం మీద చూపించాను. కలం జేబులో వేసుకుని పోస్టాఫీసుకేసి బయల్దేరాను.

రోడ్డుమీద జనం హడావిడిగా తిరుగుతున్నారు. కార్లూ, బండ్లూ, ట్రాములూ, సైకిళ్లూ- ఒకటేమిటి! వీళ్ళందరికీ అంత అర్జంటుపనులున్నాయిగావును! వీళ్ళ సంసారతాపత్రయం చూస్తే ఒకవేపున నవ్వు, జాలీ- కలిగాయి. ఇంత కష్టపడి వీళ్ళంతా బావుకుంటున్న సుఖం ఏమిటో!

బావ అంత అర్జంటుగా యెందుకు పరిగెత్తుకు రావాలి? అక్కయ్యకు కొంచెం సుస్తీ చేస్తే మాత్రం తగ్గదా? ఈ పెళ్ళి అయినవాళ్లదంతా ఒక చాదస్తం. ఆలోచిస్తున్న కొద్దీ యీ పెళ్ళి చేసుకున్నవాళ్లంతా ఒట్టి అమాయకులనీ, వాళ్ల ఆర్భాటంలో, తాపత్రయంలో అర్థమే లేదనీ తోచసాగింది. (నా అల్ప బ్రహ్మచారి హృదయానికి మాత్రం. వివాహితులూ, గృహస్థులూ నా అల్పభావాలను మన్నించగలరు.)

ఎండ మండిపోతున్నది. అప్పటికే పది గంటలు దాటింది. ఒకవేపున కడుపులో ఆకలి వేస్తున్నది. కారే చెమటల్ని తుడుచుకుంటూ, కాళ్ళీడ్చుకుంటూ, నాఅవస్థకు నేనే జాలిపడుతూ నడుస్తున్నాను.

చివరకు గమ్యస్థానానికి చేరుకున్నాను. టెలిగ్రాం యిచ్చి బ్రతుకు జీవుడా అని యింటిదారి పట్టాను.

'ఒరేయ్, అబ్బాయ్, స్నానంచేసిరారా అన్నం ఒడ్డిస్తాను'-అమ్మ కేక వేస్తున్నది.

స్నానం చేద్దామని లాల్చీవిప్పి కలం తీసి బల్లమీద పెడదామని చేయి జేబులోకి పోనిచ్చాను.

ఒక్కసారి గుండెలు ఝల్లుమన్నవి. కలం యేదీ? దారిలో యెక్కడో జారిపోయిందిగావును! అది సామాన్యపు కలం కూడా కాదు. నలభై రూపాయలు పోసి ఫస్టుక్లాస్ పార్కరుపెన్ను మొన్ననే క్రొత్తగా కొన్నాను. అమ్మయ్యో! అది పోతే యింకేముంది?

నాకు ప్రపంచంఅంతా తిరుగుతున్నట్లు తోచింది. ఒక్కపరుగున వీధిలో పడ్డాను. ఆ క్షణాన నిలువెత్తూ నన్నావహించింది కోపం!

ఎవరిమీద?

అందరిమీద. ఆకలిసంగతి మర్చిపోయాను. కలంకోసం అన్వేషణ చేస్తూ దారివెంట నడుస్తున్నాను.

మండుటెండలో తెల్లటి యిసుకరోడ్డు ప్రక్కన మెరుస్తున్నది. ఇసుకలో నల్లగా మెరుస్తున్నది. ఏమిటి?

నా నలభైరూపాయల ఫస్టుక్లాస్ పార్కరు పెన్ను!

రోడ్డువంక చూచాను. జనం యింకా అట్లాగే తిరుగుతున్నారు. ఎవరినైతే నేను యింతకుముందు అర్థంలేని తాపత్రయం పడుతున్నారని గర్హించానో, వాళ్ళకి కృతజ్ఞతగా ఒక్క నమస్కారం విసిరాను. ఎందుకంటారేమో? నా నలభైరూపాయల పెన్ను వాళ్ళ హడావిడిలో చూడనందుకు. చూచినా తియ్యనందుకు!

ఎర్రటి మండుటెండలో యింత అవస్త పడవలసివచ్చినందుకు, కోపంతో చికాకుతో, మనస్సు దహించుకు పోతున్నది.

వాకిట్లోకి వచ్చాను. లోపలనించి మాటలు వినిపిస్తున్నాయి.

'టెలిగ్రాం యిచ్చి వచ్చాడు. మళ్లీ యెట్లో పెత్తనాలకు పోయాడు గామాలు. లేనాయనా, నీకు ప్రొద్దెక్కుతుంది. అన్నం వడ్డిస్తాను.'

క్షణంలో పరిస్థితి గ్రహించుకున్నాను. నేను పడిన శ్రమ అంతా వృధాయే నన్నమాట! మాబావ యిప్పుడే రైలు దిగాడు.

'ఎప్పుడొచ్చావు బావా? ఒక్కసారే పండుగకు శలవు పెట్టి రమ్మని యిప్పుడే టెలిగ్రాం యిచ్చివచ్చానే?'-అన్నాను లోపలకు అడుగు పెడుతూనే.

'ఇంకా నాలుగురోజులు ముందే వచ్చానోయ్, అయితే రావద్దంటావా బావా?'- బావ నవ్వుతూ వేళాకోళంగానే అన్నాడు. అక్కయ్య వాకిట్లో నుంచుని నవ్వుతున్నది. వాళ్లకేం తెలుసు నా అవస్త?

బావ వేళాకోళానికి నాకు చిన్నతనమేసింది. ఎక్కడలేని ఉక్రోషమూ వచ్చింది.

నాలిక కొరుక్కున్నాను. జవాబేమీ చెప్పకుండానే విసురుగా గదిలోకి వెళ్లిపోయాను.

తెరిచివున్న కెమిస్ట్రీపుస్తకం ఆల్కలీలూ, ఏసిడ్‌లూ గురించి యింకా అఘోరిస్తూనే వున్నది!

కుర్రాడు గొంతెత్తి పాడుతున్నాడు. 'జీవితం' లోదికాబోలు- 'నాపై కోపం నీకెందుకూ ... డడడా ...డడడా...డడా డడా...'

ఉలిక్కిపడ్డాను. శాస్త్రిగారూ, శాకుంతలమూ, దుర్వాసుడూ- ఒకటేమిటి? ఆరోజు ఘట్టమంతా కళ్లకు కట్టినట్లు కనిపించింది.

ఇంకోసారి నాలుక కొరుక్కున్నాను. ఇవాళ,యెన్నిసార్లు కోపం వచ్చింది నాకు?

*　　*　　*　　*

పచ్చటి కాశ్మీరపుశాలువా, కళ్లజోడూ, నుదుటిమీద అనుభవాన్ని తెలిపే ముడతలూ...... శాస్త్రిగారు పాఠం చెపుతున్నారు. ఇంక వుండలేకపోయాను. తటీమని లేచి అన్నాను.

'ఓడిపోయాను, శాస్త్రిగారూ!'

కుర్రాళ్లంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు నావంక.

శాస్త్రిగారు పుస్తకంమీదనుంచి తలయెత్తి అన్నారు.

"రెండురోజులన్నా నిగ్రహం సాధించలేకపోయావటోయ్?' అయినా కోపాన్ని జయించటం అంత సులభం అనుకున్నావా? అంత తేలికే అయితే అందరమూ కామక్రోధమోహాలను జయించి యింద్రియాతీతులమే అగుదుము. కూర్చోవోయి పిచ్చినాయనా!"

పిల్లలంతా ఘొల్లుమన్నారు.

శాస్త్రిగారు లేచి అన్నారు "ఊరుకోండోయి నాయన్లారా! వాడికున్న బుర్ర మీకందరకూ వుంటే ఆప్రశ్న మీకూ తోచివుండును. శ్రుతిశ్రుతంగా వినే దానికంటే, అనుభవపూర్వకంగా జ్ఞానం ఆర్జించటం గొప్పకదుటోయ్ మరీ?"

ఈసారి తలకాయ పైకియెత్తాను. కుర్రాళ్లంతా నాఅజ్ఞానానికి నవ్వినా,శాస్త్రిగారు మాత్రం నాలోని వివేకాన్ని, విచక్షణా దృష్టినీ గ్రహించినందుకు సంతోషించాను!

★★

సినిమా:

# ★ జీవితంలో మార్పు రావాలి ★



శ్రీ ఎన్. జగన్నాధ్ బి. ఏ.

సినీమాలు చూడటంచేత సాధారణజనం చాలా చెడిపోతున్నారనే సంక్షోభం బాగా ప్రచారం చేస్తున్నది ప్రభుత్వం. నాగరికత సంపాయించిన జనం చెడిపోవటం సినిమాలవల్ల నేర్చుకోరు. గా. ఆర్. ఆర్. దివాకర్, తమ ప్రతి ప్రసంగం లోనూ సినీమానిగురించి ఏదో ఒక రీతిగా సంస్కరణ సూత్రాలనీ ఝుడిపింపులనీ విసరని రోజు గత 2, 3 సంవత్సరాలల్లోనూ లేవనే చెప్పవచ్చు. మొన్న ఈమధ్య రాజేంద్ర ప్రసాద్ గారు కూడా, తమకే గనక అధికారం ఉంటే అవి నీతినే ప్రదర్శనాదర్శంగా పెట్టుకుంటూన్న సినిమా చిత్రాలన్నిటినీ బహిష్కరించేద్దునన్నారు.

ఇహ పెద్దలే ఈవిధంగా సెలవిస్తూన్నప్పుడు ప్రాంతీయమంత్రులు (ముఖ్యంగా మొరార్జీ దేశాయి, గోపాలరెడ్డి ప్రభృతులు) ఈ ఉద్దేశ్యాలనే, పీలుచూసుకుని వల్లించటం జరుగుతోంది.

ఇంతమంది పెద్దలూ చేసిన ఈ ప్రచారంలో బయలుదేరిన అసలు హంశాలు ఏమిటంటే:

1. ప్రస్తుతపు సినిమాచిత్రాల్లో అవినీతిని ప్రకోపింపచేసే అంగ విన్యాసాలూ, కామోద్రేకాన్ని కలిగించటంకోసమే వ్రాయబడిన పాటలూ, మాటలూ, చేష్టలూ, జుగుప్సాకరమైన నృత్యాలూ, వ్యంగ్యమైన సంభాషణలూ, వెఱ్ఱిచూపులు గల నాయకులూ, వెగటయేటట్టు మీదబడే నాయికలూ, రోజురోజుకీ, ఎక్కువయిపోతున్నాయనీ,

2. ఈలాటి ప్రదర్శనాలు ప్రొడ్యూసర్లు వదిలి పెట్టి, నీతికరమయిన, విజ్ఞాన పూరితమయిన చిత్రాలు తీయడంలోకి మార్చుకోవాలనీ,

3. తగినంత తొందరగాగనుక ప్రొడ్యూసర్లు ఈ మార్పు తమంతట తామే తెచ్చుకోకపోయినట్లయితే, కేంద్రప్రభుత్వమూ, రాష్ట్రీయ ప్రభుత్వాలూ కలిగించుకొని ఈ అత్యవసర మయిన మార్పు తీసుకురావడానికి ఏమీ జంకవనీ.

ఇలాటి కొన్ని సలహాలూ, బెదిరింపులూ రేడియో ద్వారానూ, పత్రికాముఖంగానూ, ప్రత్యక్షం గానూకూడా ప్రభుత్వోద్యోగులు పలుకుతూనే వస్తున్నారు. సినిమా కూడా, సారస్వతంలాగే ప్రజల సంస్కృతిని ప్రతిబింబించే ఒక కళాస్వరూప మనీ, అంచేత సినీమాలు అవినీతికరంగా ఉండటం దేశంయొక్క పరువు మర్యాదలకి తీరని కళంకమనీ కాబట్టే ప్రభుత్వం (అవశ్యమయితే) కలుగచేసుకుని దేశ గౌరవం నిలబడేటట్లు సినిమాలు తీయాలనే నిర్బంధం ఏర్పాటుచేయటానికి జంకదనీ అనేకసార్లు సెలవిచ్చారు.

కాని రోజులు గడుస్తూనేఉన్నాయి. ప్రతీ క్రొత్త సినీమా, అంతకుముందరిదాని కంటే ఉల్లాసం కలిగించేలాగా చేయటానికి ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. ప్రజల నీరసభావాలకి చక్కలిగింతలు పెట్టే ఘట్టాలే సినీమాల్లో ప్రదర్శించబడుతున్నాయి. గాని, ప్రభుత్వం ఎంత గోల పెట్టినా, ప్రజలని వైజ్ఞానిక మార్గాల్లో పెట్టే సుమతిశతకం, ఎక్కాల పుస్తకాల్లాటి చిత్రాలు ఎవరూ తీయటమే లేదు.

ఈ పరిస్థితులకి ప్రభుత్వాన్ని నిందించవలసిన పనీ లేదు,—ప్రభుత్వం ప్రొడ్యూసర్లని బలవంతపెట్టి సాధించేదీ లేదు.

ప్రతి సంవత్సరమూ క్రొత్తగా తీయబడే సినీమాల్లో నీతి నియమాలు నశించిపోవటానికి కారణాలు చాలాఉన్నాయి–(కాని ఆ కారణాలకి కొన్ని కారణాలున్నాయి)

ప్రొడ్యూసర్లు ఏమంటారంటే–"మేం సినీమాలువ్యాపారదృష్టితో తీస్తున్నాం కాని, ప్రజలకి పాఠశాలలు, దేవుడిగుళ్లూ చేయావలసిన ఉపకారాలు చేయటానికి కాదు; అంచేత ఎటువంటి కథలకీ ఘట్టాలకీ దృశ్యాలకీ ప్రజలు ఎక్కువ డబ్బిస్తే వాటినే మేం తయారుచేస్తాం. ఈ పరిస్థితుల్లో ప్రజల అభిరుచులను బాగుచేయవలసిన బాధ్యత ప్రభుత్వానిది కాని మాది కాదు" అంటారు.

నిజమే. ఇదే సహజమైన వ్యాపారసరళి: ఇళ్లు కట్టడంకంటె లాభంకనుక సినీమా హాలూ, కాఫీ హోటలూ, కట్టుకోవడం వ్యాపారసరళి- సారా అమ్మడు లేకపోవడంచేత చక్కరఉత్పత్తికూడా మానేసి ఫాక్టరీమూసేయుట వ్యాపారసరళి. బంగారం, పత్తి, కొని ఉపయోగించుకోవటంకంటె వాటి ధరలమీద పైపందాలు వేసి డబ్బు సంపాయించటానికి ప్రయత్నించటం వ్యాపారసరళి.

కరువు రోజుల్లో అయినాసరే, కంగులు పైరు చేయటానికి వీలైన భూముల్లోకూడా పొగాకే పండించటం వ్యాపార సరళి. కందులు ఆహారపదార్థమైనా, పొగాకు దురభ్యాసాలకి కారణమయినా ఈ పాప పుణ్యాలు ధనార్జనఆశయంగా పెట్టుకున్న వ్యాపారస్తులకు ఏమీ అంటుకోవు. ఇది చూస్తూ ఊరుకుంటూన్న ప్రభుత్వం, వ్యాపారసరళిగానే సినీమాలు తీయ పూనుకున్నవాళ్లని, నీతి నియమాలున్న చిత్రాలు తీయండి, బూతులు తగ్గించండి, అని సలహా చెప్పడం చాల్లా అనవసరం. ఈ చప్పిడి సలహాలవల్ల ప్రొడ్యూసర్లకి అమాంతం పాపభీతి కలుగదు, సంఘానికి నీతిమార్గం ఏర్పడదు.

ప్రాథమిక పాఠశాలలకంటె వయోజన శిక్షణ కంటె, అత్యద్భుతమయిన విద్యా విధానంగా సినీమాలు ఉపయోగపడగలవని ఎంత ఘోషించినా ఏమీ ప్రయోజనం లేదు. ఎంచేతంటే, ఈ పాఠశాలల్లో ఉపయోగించే పుస్తకాల నియామకం ప్రతి జిల్లాలోనూ ప్రతి రాష్ట్రంలోనూ, పుస్తకాల మంచి చెడ్డలమీద ఆధారపడటం లేదు. రచయితల ప్రావీణ్యతమీదా పాండిత్యంమీదా ఆధారపడటం లేదు. విద్యార్థుల అభిరుచులమీద, ఉపయోగంకొద్దీ ఇవి నియమించ బడటంలేదు. కేవలం వ్యాపార రీత్యా పెట్టుబడి పెట్టి ప్రచురించిన పెద్ద మనిషి పలుకుబడికొద్దీ, పెద్ద ఉద్యోగులకి పారితోషికంగా సమర్పించుకోగల కానుకల విలువలనుబట్టి ఏర్పరచబడుతున్నాయి.

అంచేత ప్రభుత్వం సినిమావిషయంలో నోరు మూసుకు పడిఉండాలని నామతం కాదు. ముఖ్యమైన విషయాలని సర్దుకుంటే చిల్లరసంగతులు సులభంగా సర్దవచ్చనీ, అసలు వాటంతట అవే సర్దుకుంటాయనీ నా విశ్వాసము. కాని చిన్నవిషయం అయినా ఇదేముందర మంచిమార్గంలో పెట్టాలని ఎంత మూర్ఛించినా ఏమీ లాభం ఉండదు. ఇటీవల తొందరపడి మద్యపాన నిషేధం అని పెట్టినందువల్ల ఏం ప్రయోజనం కలిగింది? ఇది కొన్ని సంవత్సరాలపాటు ప్రజల్లో కొంత విద్యావ్యాప్తి ప్రచారం జరిగింతరువాత తాగుడు మాన్పుకు నేందుకు సుప్రసిద్ధ వైద్యులు, మనశ్శాస్త్ర నిపుణులు ఏర్పరచిన మార్గాలని బోధించి నెమ్మదిగా మానిపిస్తే ఎంతబాగుండేది.

ఎంత హఠాత్తుగా ప్రవేశపెట్టినా, మద్యపాననిషేధం చాలా బాగానే అమలుజరుగుతున్నది అని చంకలు కొట్టుకుంటూన్న ప్రచారం, ప్రతిరోజూ వచ్చే "కొన్ని వేల గాలన్లు సారా బట్టీలు పట్టుకు" న్నామనే వార్త ముందు తోక ముడతపెట్టి ఉరాయిస్తోంది. ఇవి కాక పట్టుకోబడని బట్టీలు కొన్ని లక్షలగాలన్ల సారా సరఫరా చేస్తున్నాయని ప్రజలకి బాగా పరిచయమే.

ప్రజల పరిస్థితులను విద్యావిధానాన్నీ మార్చలేనంతకాలం సినీమాలని గురించీ, అసభ్యసాహిత్యాన్ని గురించీ ఆంక్షలు పెట్టడం మద్యపాననిషేదం లాగ తప్పటడుగులు వెయ్యటమే అవుతుంది.

అయితే, ఈ శుష్కమయిన సినీమా శృంగార ఘట్టాలని చూడ్డానికీ, కల్లబొల్లి కట్టుకథలని మెచ్చుకుని, వాస్తవికమైన సాంఘికదృశ్యాలని బహిష్కరించటానికీ, చిల్లర మల్లర చవకబారుహాస్యాన్ని ఆనందించి, ఆలోచనా, ఆవేశం పుట్టించే ఉదాత్త రసాలనిజీర్ణించుకోలేక పోవటానికీ, ఏమార్పువచ్చింది. ఈ పదేళ్లలోనూ, ప్రజల్లో?

ఇదే సవిస్తరంగా పరిశీలించవలసిన విషయం. ఎంచేతంటే ఇది ఒక్క సినీమాలో వచ్చిన మార్పుకాదు. ఇదేరకపు మార్పు సారస్వతంలోనూ, సంగీతంలోనూ, కూడా ఏర్పడింది.

కల్పితమైనా, అనుభవమైనా, రంకురంగాలు వర్ణించే సారస్వతం అమ్ముడుపోయినట్లు ఇతర కథలు చెల్లటంలేదు.

అందంలేనివాళ్లయినాసరే ఆలింగనం చేసుకోబోతూన్నట్టున్న ఫొటో ఉంటే, ఒక్కటి త్రివర్ణ చిత్రంకంటే ఆకర్షిస్తోంది.

టిక్కు టిక్కు టక్కులాడి,—డడడా, డడడా,—లారాలప్పా, అనే పాటల సాహిత్యంముందు. వేమనపద్యాలనుంచి రెంకిపాటలవరకూ అన్నీ ఎగిరిపోయాయి.

(కొంతకాలంక్రిందట, "కవిత్వానికి మాటలు అవసరమా" అని, శ్రీ శ్రీ. ప్రతిపాదించినది ఇంత తొందర్లో ఈవిధంగా నిజమౌతుందని ఎప్పుడూ అనుకోలేదు)

సంస్కృతిలో ఇటువంటి పరిణామం రావటానికి ప్రజల దైనికపరిస్థితులు కారణం. పరిస్థితులు అలా మారటానికి ప్రపంచ యుద్ధం, పాకిస్తాన్ పంపకం, స్వాతంత్ర్య సంరంభం, గాంధీహత్య, నెహ్రూ ప్రభుత్వం, కమ్యూనిస్టు హత్యలు, పోలీసుల కాల్పులూ, భూకంపాలు, వరదలు, రైలుప్రమాదాలు రైతులబాధలు, చైనాలో విప్లవం, ఇండో చైనాలో యుద్ధం— ఇలాగే లక్షకారణాలున్నాయి. బియ్యానికి కరువు, ఇంచేత భూమికి ఎరువు, ప్రస్తుతం ఒంటెప్రాటు, పదేళ్ళతరువాత 60 లక్షల ఎకరాల సాగుబడి, జీవించేందుకు మార్గం లేదు. చచ్చిపోవడానికి ధైర్యంచాలదు. ప్రతిమనిషికి దినదినగండం తినడానికి తిండి చాలదు, చదువుకోడానికి స్కూళ్లు తక్కువ. చదువుకుంటే ఉద్యోగం ఉండదు, ఉద్యోగంచేసినా జీతాలుచాలవు, అంచేతే పైమేత, ఆ తరవాత అలవాటు. అదీగాక పై అధికారులని మేపాలి. ఎలిమెంటరీస్కూల్లో చేర్చుకోవటందగ్గర నుంచి ఎన్నికలలో గెలవటంవరకూ అంతా మొహమాటాల పుట్ట, లంచాలతోట. చెప్పేదొకటి చేసేదొకటి, నిజం లేదు, నియమం లేదు. ఎవడికైనా ఉంటేవాణ్ణి తప్పించి, మూడులోకాలు తిప్పించి మూడుచెరువుల నీళ్లు తాగించేవరకూ మిగిలినవాళ్ళకి దాహం తీరదు.

ఇటువంటిరోజుల్లో, ప్రజలు గుఱ్ఱపుపరుగులాంటి సంగీతమే కోరారంటే, ఇంకేం చేస్తారు? ఆలోచనాశక్తిని హింసపెట్టకుండా, చటుక్కున చవకగా నవ్వు తెప్పించుకునేందుకు ప్రయత్నం చేశారంటే, నయం. ఇంకేమైనా చేశారు కారు.

ప్రభుత్వంలో పైమెట్టుమీద వున్నవాళ్లు పెద్ది స్వార్థపరులయినందువల్ల ఏమి ఉపయోగం ఉంది—స్వార్థంకోసమే ప్రజాపరిపాలన వినియోగించుకుంటూన్నవాళ్లు ఉద్యోగులుగా చేరితే. పాలక వర్గంలో నీతి నియమాలు నశించిపోయినప్పుడు, ప్రజల్లో క్షీణించిపోతున్నాయని యేడిస్తే యేంలాభం? ఆకలిడొక్కలకి అధ్యాత్మిక చింత ఏం నచ్చుతుంది? ప్రజలు తాము తమ దైనిక విషాదావస్థలలో, నిషాపదార్థ లని, అవినీతిపంథాలని అలవాటు చేసుకున్నారంటే నిందించవలసింది ఎవరిని?

అర్ధాకలితో నౌకరిచేసేవాడొకడు ఆదాయపు పన్ను చెల్లించడానికి వెం పెట్టుకున్నవాడొకడు ఎవడికి చూసినా ఏదో భయం, ఎంతో అశాంతి ఎవ మీదో కోపం, ఎందుకో నిరుత్సాహం, జీ తంలో నిరాశ, సంఘంమీద ద్వేషం. అ దరిలోనూ దేశం గంగలో కలిసిపోతూంద దృఢమైన నమ్మకం, బలంగా ఏర్పడి, ఏకీ వించి, కరిగిపోయి, కలిసిపోయి, జాతి నిర్వీ ర్యమయినప్పుడు, సంస్కృతి నేలమట్టమై పోయినప్పుడు, శివాజీధైర్యం తలుచుకునీ టాజ్ మహల్ సౌందర్యం వినీ సంతోష పడడం ఎవరి తరం?

ఈ కారణాలు గమనించకుండా కేవలం ఫలితాలు అరికట్టటం ప్రభుత్వా నికైనాసరే అసాధ్యమే.

సినీమాలూ సారస్వతమూ ప్రజల అభి రుచులని దిగదీస్తున్నాయన్నమాట కొంత వరకు మాత్రమే నిజం. మొదట్లో అభి రుచులు మారినందువల్లనే కళల్లో సౌందర్యం పోయి కళంకం ప్రబలింది. ప్రజలలో నీచ సుఖాలకి కారణం, జీవితపు పరిస్థితుల్లో చీకుచింతలు ఎక్కువవటం.

అంచేత రావలసిన మార్పు ఏ కొ నుంచి రావలసివస్తోందో ఆనవాలు కట్టడం కష్టంగాదు.

ఎరువులు మార్చి, అంట్లుకట్టినందువల్ల పువ్వుల రంగులు మార్చడం మంచి పద్ధతి. కాని, పువ్వులకి రంగులు వేయడం బు మంతులు చేసేపనికాదు.

ఈ మాలిన్యంలో విశుద్ధమైన నమూనాలు లేకపోలేదు. నిర్దుష్టమైన భరతనాట్యం ప్రవేశపెట్టడానికి మొట్టమొదటి యత్నం "త్యాగభూమి"లో జరిగిందనుకుంటాను. అందులో బేబీ సరోజ చిన్న జతిస్వరానికి నృత్యం చేసింది. ౧౯౩౯ లో తీసిన "సైరంధ్రి" చిత్రంలో ఈ రచయిత అర్జున బృహన్నల పాత్రలుధరించి తిల్లానానృత్యం చేయడం రెండవ యత్నం. ఈ రెంటికీ మధ్య "జలజ" అన్న చిత్రంలో భరత నాట్యం విరివిగా ఉపయోగించబడింది. కాని, దర్శకత్వం బాగులేక కాబోలు ఆ చిత్రం సరిగా నడవలేదు. "రైతుబిడ్డ" చిత్రంలో కూచిపూడినాట్యం ప్రవేశపెట్టబడింది. భరతనాట్యం చేసేవారు చిత్రాలలోకి అధికంగా ప్రవేశిస్తున్నకొద్దీ ఇతర నృత్యభేదాల సాంకర్యం హెచ్చుతున్నది.

29-11-50

**చిత్రసమీక్ష:**

# షాయిర్

'జుగల్ పిక్చర్స్'వారి 'షాయిర్' చిత్రం ఈనెల 24వ తేదీనుండి మద్రాసు, సాగర్ టాకీసులో ప్రదర్శింపబడుతోంది. హాలువద్ద టిక్కెట్లకోసం జరిగే త్రొక్కులాటనుబట్టి యీ చిత్రం బాగా సొమ్ముచేసుకునే చిత్రాలలో ఒకటి అని అనుకోవచ్చును. దేవానంద్, సురయ్యా, కామినీ కౌశల్, ఆగా మొదలైన ప్రముఖ నటీనటులు ఇందులో పాల్గొన్నారు. దర్శకుడు చావ్లా, సంగీత దర్శకుడు గులాం మహమ్మద్.

కొత్త కథనిగాని, కొత్త సంగీతాన్నిగాని ఆశించి వెళ్ళినవారికి ఆశాభంగం కలుగుతుంది. ఎన్నివందల హిందీ చిత్రాల్లోనో చూసిన విషయాలనే మళ్ళీ చూస్తాము. అదే ఇతివృత్తం, అవే సన్నివేశాలు, అవే సమస్యలు, అవే పరిష్కారాలు. పావుగంట హాల్లో కూర్చునేసరికి కథ ఎల్లా నడుస్తుందో, ఎల్లా ముగుస్తుందో, జోస్యం చెప్పవచ్చు. మార్కెట్ కోసమే ప్రతి వస్తువూ తయారవుతున్న ఈ రోజుల్లో సినిమా కళకూడా మార్కెట్ వస్తువుగా తయారు కావటంలో ఆశ్చర్యం లేదు.

**కథ**

దీపక్ అనే ధనవంతుడు, యువకుడూ అయిన ఒక కవి ఉంటాడు. అతని కవిత్వాన్ని చదివి సేఠ్ జ్వాలా ప్రసాద్ అనే కోటీశ్వరుడి కుమార్తె బీనా కుమారి అతన్ని గాఢంగా ప్రేమిస్తుంది. అతడు కూడా ఆమె తనకి రాసే పుత్తరాలనిబట్టి ఆమెని గాఢంగా ప్రేమిస్తాడు. (పూర్వం నలుడు, దమయంతి ఒకళ్ళ గుణగణాలు ఒకళ్లు విని ప్రేమించుకున్నట్టు) బీనా కుమారి దీపక్‌ను ఒకసారి బొంబాయి రావలసిందని లేఖద్వారా ఆహ్వానిస్తుంది. దీపక్ తన పల్లెటూరు విడిచి బొంబాయి వెడతాడు. దీపక్‌ను చిన్నప్పటినుంచీ ప్రేమించిన రాణి (సురయ్యా) అనే పల్లెటూరిపిల్ల అతని వియోగాన్ని భరించలేక పాటలు పాడేస్తుంది.

దీపక్‌ను కలుసుకోవటానికి బీనా కుమారి కారులో స్టేషనుకు వెడుతుంది. కాని కొంచెం ఆలస్యమవుతుంది. ఈ లోగా ఒక విటునికోసం స్టేషన్‌కి వచ్చిన వేశ్య ఒకతె తను ఎదురుచూసే విటుడు ఇతడే ననుకుని దీపక్‌ను ఇంటికి తీసుకువెడుతుంది. దీపక్ కూడా ఆ వేశ్యే బీనాకుమారి అనుకుని వెడతాడు. బీనా స్టేషన్‌కువచ్చి, నిరాశతో యింటికి వెళ్ళిపోయి విరహబాధ భరించలేక పాటలు పాడటం మొదలు పెడుతుంది.

వేశ్యయింటిలో దీపక్ 12 ఏళ్లకిందట స్వగ్రామంనుంచి పారిపోయిన ప్రకాష్ (ఆగా) అనే చిన్ననాటి స్నేహితుణ్ణి కలుసుకుంటాడు. ఈమె బీనా కాదని, వేశ్య అని చెప్పేసరికి దీపక్ అక్కడినించి వెళ్ళిపోయి ప్రకాష్‌యింట్లో మకాం పెడతాడు. పైగా యీ ప్రకాష్ రాణికి అన్నగారే. ప్రకాష్ తిరిగి కనిపించిన సంగతి దీపక్ యింటికి రాస్తాడు. అన్ననుచూసే నెపంతో దీపక్‌ను చూడవచ్చునుగదా అని రాణి యింటిదగ్గర్నుంచి బయల్దేరి బొంబాయి వస్తుంది.

బీనాకుమారి తండ్రి జ్వాలాప్రసాద్‌కు ఒక యూరపియన్ భార్య, కూతురు వుంటారు. ఆ కూతురుకీ ప్రకాష్‌కీ పరిచయం. యూరపియన్ భార్య జన్మదినోత్సవం జరుగుతుండగా ప్రకాష్ దీపక్‌ను వెంటబెట్టుకుని ఉత్సవానికి వచ్చి అతనిని జ్వాలాప్రసాద్‌కు పరిచయం చేస్తాడు. జ్వాలాప్రసాద్‌కు, దీపక్ ఎవరో కాదని, కీర్తిశేషుడైన తన మిత్రుని కొడుకేనని తెలుస్తుంది. దీపక్‌ను ఇంటికి పిలుచుకు వెడతాడు. అక్కడ దీపక్, బీనా తారసిల్లుతారు.

యూరపియన్ భార్యవల్ల వచ్చే గృహకల్లోలాలకారణంగా జ్వాలాప్రసాద్‌కు హఠాత్తుగా జబ్బుచేసి, మేడమెట్లమీదనుండి జారి చనిపోతాడు. ఆ సంగతి దీపక్‌కు చెప్పాలని బీనా ప్రకాష్ యింటికివస్తుంది. ఆసమయంలో దీపక్, రాణీ మాట్లాడుకుంటూ వుంటారు. దీపక్ తాను రాణీని ప్రేమించటంలేదని, బీనానే ప్రేమించానని చెబుతూవుంటాడు. బీనాపై తనకుగల ప్రేమనిగూర్చి అతడు కవితాధోరణిలో చెప్పుకుపోతుంటే బయటవున్న బీనా కొంతభాగమే విని, దీపక్ ఇంకెవర్నో ప్రేమిస్తున్నాడని అపార్థంచేసుకుంటుంది. ఇంటికివెళ్లి, దీపక్ తన యిష్టంవచ్చినవారిని పెళ్ళిచేసుకోవచ్చని, తాను అడ్డంరానని ఉత్తరంరాస్తుంది. ఈ ఉత్తరాన్ని దీపక్ రాణీకి చూపిస్తాడు. ఆమెవెంటనే బీనా యింటికి వస్తుంది. తనపై దీపక్‌కు ప్రేమ లేదని, అతడు బీనానే ప్రేమిస్తున్నాడని చెబుతుంది. ఒకళ్లకోసం ఒకళ్లు త్యాగం చెయ్యటానికి పోటీలు పడతారు. చివరికి రాణీత్యాగాన్ని బీనా అంగీకరిస్తుంది. ఆమె అప్పుడు జ్వరంలో వున్నందున రాణీ మందు తాగిస్తుంది. జ్వాలాప్రసాద్ చచ్చిపోతూ తన ఆస్తిలో ఎక్కువభాగం బీనాకే రాసియిచ్చినందున ఆ భాగాన్ని కూడా కొట్టివెయ్యాలని యూరపియన్ సవతితల్లి మందులో విషం కలుపుతుంది. బీనా చచ్చిపోతుంది. మందిచ్చినది రాణీయే గనక హత్యానేరం ఆమెపై పడుతుంది. ఆమె జైల్లో పడికూడా విషాద గీతాలు పాడుతూ వుంటుంది. చివరికి కోర్టులో అసలు హత్యచేసిందెవరో బయటపడి

---

శుద్ధమైన భరతనాట్యం నేర్చిన బేబీ కమలవంటివారు కొంతమంది అందుబాటులో ఉన్నప్పటికీ, వారు సరిగా ఉపయోగించబడంలేదు. చవుకబారు సంకర నృత్యాలకు "ఓరియంటల్ డాన్సు"లని పేరుపెట్టి వేలంవెర్రిగా ఉపయోగిస్తున్నారు. ప్రాచీన సంప్రదాయాల దృష్టిలో ఇది నృత్యమే కాదు.

ఇతర నృత్యాల సాంకర్యం లేకుండా భరతనాట్యాన్ని చిత్రాలలో ఉపయోగించడం ఉచితం కాదని మనవారూ, మన ప్రాడ్యూసర్లూ అనుకొంటున్నసమయంలో పాశ్చాత్యులు రాంగోపాల్ భరతనాట్య ప్రదర్శనాలు చూసి వాటిని ఆదరించడం విచిత్రమైన విషయం. భరతనాట్యాన్ని చిత్రాలలో ఉపయోగించడం సినిమాకళకు ఒకవేళ నచ్చకపోవచ్చు. కాని చిత్రాలలో కొద్దిపాటి నృత్యమే ప్రవేశపెట్టినప్పటికీ అది సాంకర్యం లేకుండా శుద్ధ భరతనాట్యముగా వుండవచ్చు. ఇండియా స్వతంత్రమయింది. మన కళలను ప్రపంచమంతా ఆస్వాదించి గౌరవిస్తున్నది. ఇటువంటప్పుడు మన చిత్రనిర్మాతలూ, మన కళాసంస్థలూ దేశీయకళాసంస్కృతులను చవుకపరచడమూ, సంకరం చేయడమూ మాని స్వచ్ఛంగా ప్రదర్శించవలసిన బాధ్యత కలవారవుతున్నారు.

రాణీ విడుదల అవుతుంది. రాణీని దీపక్ ప్రేమించకపోయినా, మిగిలివున్నది ఆమె ఒక్కతే గనక విధిలేక పెళ్లాడినట్టు ఆమెను వివాహం చేసుకుంటాడు.

ఈ కథ ఏవిధంగా చూసినా కొత్తది కాదు. ఒక పురుషుణ్ణి యిద్దరు స్త్రీలో, ఒక స్త్రీని యిద్దరు పురుషులో ప్రేమించటం హిందీ చిత్రాల్లో మామూలై పోయింది. ఈ సమస్యను పరిష్కరించటం కోసం అమాంతంగా ఒకరిని చంపటం కూడా మామూలైపోయింది.

## చిత్ర జగత్తు

ఇది లోపమో కాదో తెలియదుగాని - మన చిత్ర జగత్తుకూ వాస్తవజగత్తుకూ పోలికలు చాలా తక్కువ. వాస్తవజగత్తులో సమస్యలు పర్వతశిలల కంటే కఠినంగా వుంటాయి. మన ఇష్టం వచ్చినట్టు అవి పరిష్కారం కావు. యాదృచ్ఛికమనేది చాలా కొద్దిగా వుంటుంది. అదే ఎక్కువగా వుంటే అది యాదృచ్ఛికం కానేరదు. నేటి చిత్రజగత్తులో అలా కాదు. ఎంతలేనిసమస్యలైనా యిట్టే మంచు విడిపోయినట్టు విడిపోతాయి. ఆ కథ పౌరాణికమైనా, సాంఘికమైనా, జానపదమైనా ఒకటేరకం సమస్యలు. పౌరాణికంలో అయితే దేవతలు, విష్ణుమూర్తులు వచ్చి మంచివాళ్లని రక్షిస్తారు. సాంఘికంలో అయితే ఏ స్నేహితుడో హఠాత్తుగా ప్రత్యక్షమై కాపాడతాడు.

అంతేకాదు చిత్రజగత్తులో మనుషులకి ఆకలిదప్పులుండవు. సాధారణంగా అందరూ ఆర్థిక యాతిబాధలకి అతీతులై వుంటారు. వాస్తవజగత్తులో వారి యథార్థస్థానమేదో మనకి సూచనప్రాయంగానైనా తెలియదు. అందరూ మేఘమండలాల్లోనే సంచరిస్తారు. నాయికా నాయకులకి ప్రేమ విహారాలూ, ప్రేమ సంభాషణలూ—అసలు ప్రేమించటం తప్పమరోపనే వుండదు.

వారి విప్రలంభశృంగారం జయదేవుడి గీతగోవిందంలో రాధకిమల్లే—అంత మధురంగాను, సాఫీగానూ నడిచిపోతుంది.

షాయిర్ చిత్రంలో యాదృచ్ఛికంగా జరిగే విషయాలకే ప్రాధాన్యం. ఒకళ్లనొకళ్లు చూడకుండా, ఎరగకుండా దీపక్, బీనాలు అత్యంతగాఢంగా ప్రేమించుకుంటారు. వాళ్లు అనేకసార్లు అదివరకే ఒకళ్ళకొకళ్లు బజార్లలోను, సముద్రపుటొడ్డునా తారసిల్లినా ఫలానా అని తెలియకపోవటంవల్ల ప్రేమ పుట్టనేపుట్టదు. ఒకరిపేరు మరొకరికి తెలియగానే హఠాత్తుగా ప్రేమపుట్టుకొస్తుంది.

దీపక్ బొంబాయి రాగానే రాణీ అన్న ప్రకాష్‌ను కలుసుకోవటం, జ్వాలాప్రసాద్‌కూ దీపక్ తండ్రికీ పూర్వమే మైత్రివుండటం యాదృచ్ఛికంగా జరుగుతాయి. దీపక్ రాణీతో మాట్లాడుతున్నప్పుడుబీనా అక్కడికి రావటం, అతని మాటల్లో కొంతభాగాన్నే విని శంకించటం యాదృచ్ఛికమే. చివరికి ప్రధానసమస్యను పరిష్కరించటానికి ఇద్దరు నాయికల్లో ఎవరో ఒకర్ని చంపివెయ్యటం తప్ప మరో మార్గం కనిపించకపోవటం శోచనీయం. రాణీని మొదటినుంచీ తిరస్కరిస్తూవచ్చిన దీపక్‌కు చివరలో ఆమెను అంటగట్టడం కంటే, దీపక్ బీనాలకు వివాహం చేయించటమే బాగుండేది. అదేమిటో, చిత్రజగత్తులోని న్యాయస్థానాల్లో చివ్వరి కెప్పుడూ సత్యమే జయిస్తుంది.

సురయా, దేవానంద్, కామినీకౌశల్ ముగ్గురూ మొత్తంమీద పది పాటలదాకా పాడారు. ఈ పాటలవల్ల కథ కుంటినడక నడిచింది. కొంపో అత్యవసరమైన ఘట్టంలో విషాదగీతం ప్రారంభమవుతుంది. మామూలుగా జీవితంలో ఎవరూ అత్యంత దుఃఖసమయాల్లో రాగ, తాళయుక్తంగా పాటలు పాడరు. 'మామూలు జీవితంలో పాడకపోయినా, చిత్రాలలో హృదయానుభూతిని ప్రకటించేందుకు పాట లవసరమని' కొందరంటారు. హృదయానుభూతి ప్రకటనకు, అందులో విషాదప్రకటనకు పాటలే పాడనక్కర్లేదు. ఒక చిన్న ముఖకవళికలోనో, అవయవ చాలనంలోనో దాన్ని వెయ్యిరెట్లు శక్తివంతంగా ప్రదర్శించవచ్చు. ఒకే కథావస్తువుని 'సింబాలిజం' ద్వారాగాని, 'రియలిజం' ద్వారాగాని నిర్వహించవచ్చు. కాని ఆ రెంటినీ కలగాపులగం చేసేటప్పటికి ఏది ఏదో తెలియని అయోమయావస్థలో పడతాం.

'షాయిర్' చిత్రంలో నటించిన నటీనటులకి నటనాకౌశలం కావలసినంత వుంది. సురయా తన పాత్రని వీలున్నంతవరకూ పోషించుకుంటూవచ్చింది. హాస్యనటుడుగా 'ఆగా' ఎట్టి వెకిలిచేష్టలూ చెయ్యకుండానే నవ్వించాడు. కాని మన చిత్రాల్లోవున్న పెద్ద లోపమేమిటంటే — వాటిలో పాత్రలంటూ వుండరు. మన చలనచిత్రచరిత్రలో ఏ కొద్ది ఫిల్ములో తప్పిస్తే నిర్దుష్టంగా, ప్రతిభావంతంగా పాత్రపోషణ జరిగిన చిత్రాలు అరుదు. నటీనటుల అభినయంలో ప్రత్యేకత, స్వాతంత్ర్యం, చైతన్యం వెతికి చూద్దామన్నా కనిపించవు. తెరవెనుక దాక్కున్న ఒకానొక 'నటనసూత్రధారి' చేతుల్లో కీలుబొమ్మలవలెనటిస్తారు. ఏపాత్ర ఎంతవరకూ పెరగాలో అంతవరకూ పెరగకుండా చటుక్కుని ఆగిపోతుంది.

ఉదాహరణకి 'షాయిర్' చిత్రంలో ఆఖరున దీపక్, రాణీలకి వివాహంచెయ్యటం అతిక్రూరమంగా వున్నది. వివాహానికి ఇద్దరిలో ఎవరూ సిద్ధంగా లేరు. బీనా చనిపోగానే ఎటువంటి మానసికసంఘర్షణ లేకుండా వారికి పెళ్ళిజరుగుతుంది

అదేవిధంగా - కథ మొదట్లో బీనా స్టేషన్‌కి వెళ్ళి దీపక్ కనబడకపోయేసరికి దుఃఖసముద్రంలో మునిగిపోవటం కూడా అసహజంగా వుంది.

## ప్రజాదరణ

కళాసౌష్టవం మృగ్యమైనప్పటికీ నేటి చలనచిత్రాలకు ప్రజలు తండోపతండాలుగా ఎగబడుతూనే వున్నారు. చిత్రనిర్మాతల్లో అధికసంఖ్యాకులకి జేబులు నిండిపోతూనే వున్నాయి.

నేటి చిత్రజగత్తుకీ వాస్తవ జగత్తుకీ సంబంధం లేదని ఇందాక పేర్కొన్నవిషయం ఇందుకు ముఖ్యకారణంగా చెప్పవచ్చును. దైనిక జీవితంలో ఎక్కువభాగం బాధగా, బరువుగా పరిణమించిన క్రింది తరగతి సోదరులకి నేటి చలనచిత్రాలు కనీసం రెండు మూడు గంటలసేపైనా వినోదాన్ని, తన్మయత్వాన్ని కలిగిస్తున్నాయి. సినిమాలకి వెడితే రోజూ చికాకు కలిగించే పూరిపాకలు, చింకిపాతలు, మురికి కాలవలు, అసహ్యకరమైన ముఖాలు తిరిగి ప్రత్యక్షమవుతాయనే భయం వుండదు. తామెప్పుడూ కలల్లోనైనా చూసివుండని సౌధాంతర్భాగాలు, ఉద్యానవనాలు కనిపిస్తాయి. వెలలేని నగలు, చీరెలు ధరించి కామోద్రేకం రెచ్చగొట్టేలాగ నటించే సౌందర్యవతులు తెరనిండా కనిపిస్తారు. తమ ఊహలకికూడా అందని ఆదర్శప్రేమజీవులు కనిపిస్తారు. వీటన్నిటికీ తోడు నరాలకి ఉషారెక్కించే సంగీతం వినిపిస్తుంది. ఇంతకంటే ఏం కావాలి - సంతోషమనేది అతి అరుదుగా రుచిచూసే సామాన్యప్రజకి?

కాని నేటి సినిమాలు ఇచ్చే వినోదం కల్లు తాగితే వచ్చే నిషావంటిది. హాల్లో కూచ్చున్నంతసేపూ ప్రేక్షకుడు వాస్తవప్రపంచాన్నే కాక, తన్ను తానే మరిచి

(46-వ పేజీ చూడండి)



"షాయిర్" చిత్రంలో కామిని కౌశల్



# ప్రయోజనంలేని పశ్చాత్తాపం

"ఒక విద్యార్థి"

చెమటూడ్చి తల్లితండ్రులు చాలా కాలం నుండి చదువుచెప్పిస్తున్నా రనే సంగతి తెలిసికూడ విద్యార్థి పరీక్షలో తప్పేడు. మైనార్టీ తీరిన ఆ విద్యార్థి, పరీక్ష పోవడంచేత సంఘంలో తనకు గౌరవం లేదని ఒక అంచనా వేసుకున్నాడు. తండ్రి చదువుచెప్పించడం మానివేస్తాడు. నానా చీవాట్లు పెడతాడు. ఇంటికి వెళ్ళడంకంటె మరణం సుఖం—అనుకుని- చచ్చి సాధించేదేమిటి? ఈ మహా ప్రపంచంలో ఏమూలైన బ్రతుకలేనా? వెంటనే ఊరు విడిచి వెళ్ళిపోవాలి, అనుకున్నాడు.

కొంతదూరం నడక - దారిలో ఎండ- దాహం- ఆకలి- కాళ్ళుపీకు- నీర్సం— జేబులో చిల్లికానీతో సిగరెట్టుకొని గట్టిగా ఒక గుక్క లాగి రైల్వేస్టేషను చేరుకున్నాడు. టిక్కెట్టులేకుండా ప్రయాణం చెయ్యాలి. ప్రక్కనున్న పొలాల్లో నుండి స్టేషను పాయిఖానాదొడ్డుల ప్రక్కనుంచి ప్లాటుఫారం చేరుకున్నాడు. రైలునుండి మరోస్టేషనులో దిగేడు. పరిచయస్తులు లేని గ్రామం. చీకట్లో- అక్కడక్కడ- రోడ్డు ప్రక్కనున్న- లైట్లవెలుగులోంచి- నడక- బహునీర్సం. విశ్రాంతికి సన్యాసిమఠం పొలిమేర ముందరనే కనిపించింది. రోడ్డు దుమ్ము కాలితో మఠంలో ఒక అరుగు మీద కూర్చున్నాడు.

సంపాదించిన అన్నము తిని— హాయిగా గంజాయి పీలుస్తున్నారు ముగ్గురు నలుగురు సన్యాసులు కలసి. "అహాంయ్" "జై సీతారామ్" అంటున్నారు. చెమటూడ్చకుండా కడుపునిండ తిండి దొరికింది. అద్దెలేని మఠంలో గట్టిగా దమ్ములాగుతూ, ఖులాసా కబుర్లు చెప్పుకుని ఆనందిస్తున్నారు. అవును. పేరుప్రతిష్టలు ఎవరికొకావాలి? ఏ మానవుడైనా ముఖ్యంగా తిండి సుఖమే గా కోరేది? ఆ బ్రతుకు ఏదైనా బ్రతుకే- బిచ్చుక సమాజంలో సభ్యత్వం చవకే-" అనుకుంటున్నాడు విద్యార్థి.

"ఎవరు, బాబూ?" మానవునికి గోమాలు తప్పవన్నట్టు ఈ ప్రశ్న వచ్చిన తరువాత కూడా తప్పదనుకుని "ఈరాత్రికి పడుందామని," అన్నాడు.

"ఖాళీలేదు, బాబు. మేము చాలామంది వున్నాము. మీవంటివారు ఈ సన్యాసి మఠంలో నిద్రేమిటి?"

"కాషాయవస్త్రాలు లేవని సన్యాసులు చేర్చుకోలేదు. ఖద్దరు బట్టలు లేక పోతే... గౌరవించరు." అనుకున్నాడు. గ్రామంలో ప్రవేశించేడు. అంతగా అరుగులు లేవు. ఉన్నచోట కుక్కలు- మేకలు. అరుగులు చిన్నవి. ప్రవేశించేడు. కుక్కలు కరవడానికి వచ్చేయి. మమ్మలను ఎక్కడకి పొమ్మంటావు, అన్నట్టు లేచి నిలవబడ్డాయి మేకలు. నిట్టూర్పుతో- రోడ్డు ప్రక్కగా నడుస్తున్నాడు.

"రైలు పట్టాలమీద తల పెడితే?" నాలుగు రోడ్ల జంక్షన్‌లో నిలవబడి ఆలోచించేడు. "ఇంతచదువు చదివి తల్లిదండ్రులను సుఖపెట్టడం మాని, ఇటువంటి పనులు చేస్తే ప్రయోజనం ఏమిటి?"

సినీమా రెండో ఆట సహం అవుతున్నది. కాపలా వాళ్లూ, పోలీసువాళ్లూ తిరుగుతున్నారు.

"ఎవరు మీరు?"

"మాది కాకినాడ-పరుండడానికి స్థలం కావాలి."

"వీడెవడో దొంగలాగున్నాడు. లేక కమ్యూనిస్టా?" ఈఅనుమానంతో వున్నాయి వాళ్ల నేత్రాలు.

తిరిగి రైల్వేస్టేషను చేరుకున్నాడు. అక్కడున్న బెంచీలమీద జనం కాళ్లు చాపుకుని గురకపెట్టి నిద్రపోతున్నారు. కొంతమంది క్రింద బెడ్డింగులు. రుమాళ్లు వేసుకుని నిద్రిస్తున్నారు. మస్క్య మస్క్య ఉమ్ములు. స్టేషను ఆఫీసర్ల లాడలాపలు- గణగోణాలు. ఎక్కడా ఖాళీస్థలం లేదు నిద్రపోడానికి. పలుచగా ప్లాటుఫారంమీద నిద్రిస్తున్నారు. పుచ్చపూలవంటి వెన్నెల- అమితమైనచలి. నలుప్రక్కల పరికించి- "చలిలో ఏవిధంగా పరుండేది?" అనుకున్నాడు. ఇటు అటు తిరిగేడు. ధూమపానం వేపు ప్రాణం లాగింది. క్రింద ఎంగిలి పీకలు కనిపిస్తున్నాయి.

"బాబూ? ఏ ఊరు వెళతారు?" మేలిముసుగుతో అర్ధరాత్రిలో ఏకాంతముగా వచ్చి ముసుగు తీసింది, యువతిని సుమా అని తెలియపెం కొరకు. వెన్నెలలో నేత్రాలు- మెరిసేయి. ఇదే నావృత్తి అనేటట్టు చూచింది.

చెట్టునీ క్రింద వున్న పాయిఖానాదొడ్డి వేపు, సూదులవలె గ్రుచ్చుకుంటున్న నిరి రాళ్ళను త్రొక్కుకుంటూ నడుస్తుంటే- ఫలందొరికిందనే ఆశతో వెంబడించింది. దొడ్డిదాటి రైల్వే ఇనుపబద్దీలతో అంతమైన ప్రాకారం దగ్గర ఆగేడు. "పరుచుకోడానికి తువాలైనా లేదు" అంటూ నీరసంగా కూర్చున్నాడు. బాబూ- ఏం?"

"చిల్లరేమైనా ఉన్నదా? వుంటే... వొకర్థణా ఇస్తే సిగరెట్లు పట్టుకువస్తాను." అర్థణాతో రెండు సిగరెట్లు కొని ఒకటి ఎఱ్ఱగా కాల్చుకుంటూ యథాస్థానానికి వచ్చేడు.

"మిమ్ములను లైటువెలుగులో చూచాను," అన్నది.

"తినడానికి ఏమీ లేదూ? ఏమైనా కొని తీసుకురా కూడదూ? అరటిపళ్లు కడుపునిండుతాయి."

ఆమె వెళ్ళింది.

"నేను నిర్భాగ్యుణ్ణని తెలియలేదు ఆమెకు." అనుకున్నాడు.

చిరునవ్వుతో పళ్లుపట్టుకు వస్తే యిద్దరూ మౌనంగా పూర్తిచేశారు. కడుపు పగిలేటట్లు కుళాయిదగ్గర మంచినీరు పట్టించటానికి లేచేడు.

"అమ్మయ్య!" మూతినుండి నీళ్లు తుడుచుకుంటూ అన్నాడు. నిట్టూర్పు విడుస్తూ, ఆడజన్మ ఎత్తినా బాగుండును అనుకున్నాడు.

యథాస్థానానికి చేరుతుంటే అతని నీడతో పోటీగా వెంటబడింది యువతి.

"దీనిమీద పరుండండి." దుప్పటి పరచింది.

దూరంగా క్రింద చతికిల పడ్డాడు.

"ఏమండీ?" ప్రశ్నించింది.

"ఏం కావాలి? నీ డబ్బుతో ఆకలిమంటలు చల్లార్చుకుని, సుఖంగా చలినుండి తప్పించుకోడానికి యీ సిగరెట్టు కాలుస్తున్నాను. ఒక్కకానీకూడా లేదు దగ్గర." యువతి ముఖంలో కళలు మారేయి. చంద్రుడు మబ్బులలో ప్రయాణం చేస్తున్నాడు. కొంతసేపు మౌనం.

చంద్రుడు బయటపడ్డాడు. దూరాన్న కొరియాయుద్ధంలోకి వెడుతున్న లారీలాగ, లావుగా, బరువుగా ఒకవ్యక్తి వస్తున్నాడు. దుప్పటి తీసుకుని అతని వేపు వెళ్లిపోయింది.

ఆకలితీరినా అక్కడ భయంగా ఉంది. స్టేషన్‌లోకి తిరిగివచ్చేడు. పెద్దపెద్ద బెళ్ళమీద తమ స్వంత మన్నట్టుగా నిద్రిస్తున్నారు. "కాళీ వుంటే బాగుండును ఎక్కడా ఖాళీలేదు."

చిన్నమూల పరుండుటకు వీలుగా ఉంది. చీకటి తెల్లుంటాయేమో! అనుభవించవచ్చు. "కాళ్లు ముడుచుకుని పరుంటే మత్తుగా నిద్రపట్టింది.

పెద్దకూతలతో, చప్పుడుతో రైలువచ్చింది. నిద్దరలో అనేకమైన ధ్వనులతో మాటలు వినిపిస్తున్నాయి. నిద్ర సుఖం లేవనివ్వ లేదు. ఎండ వచ్చింది. ఎక్కడచూచినా పారవేసిన పందువు పుడకలు, ఇంకా కొంతమంది పళ్లుతోముకుంటున్నారు. అక్కడక్కడ నోటిలో తెల్లని నురుగుతో బ్రషులు ఆడుతున్నాయి. కొళాయి ఖాళీ లేదు. కాలవగట్టు వేపు వెళ్లేడు. అవశిష్టములు తీర్చుకుని నెమ్మదిగా వచ్చేడు స్టేషన్‌లోకి. హోటల్ హడావిడిగా ఉంది. ఆకలి దహిస్తున్నది. పంట్లాం జేబులో రెండు చేతులు పెట్టి "ఖాళీ," అన్నాడు.

మిషన్ చక్రాలవలె బుర్రనిండా అనేక విషయాలు తిరుగుతున్నాయి. "అమ్మ గుండె బాదుకుంటూ ఏడుస్తూంటుంది. తిండి లేకుండా తండ్రి తిరుగుతూంటాడు ఎక్కడైనా కనిపిస్తానేమో నని. అమ్మకు అసలే గుండె దడ. ఏమై పోతుందో! ఇంటికి వెళ్ళిపోతేనే బాగుంటుంది. ఇంత చదువు చదివినా ఒక కానీ తెచ్చుకో లేకపోయాను. పైగా ముష్టి ఎత్తవలసి వచ్చింది. అమ్మా నాన్నా దగ్గర ఉంటే యీ అవస్థ ఎక్కడిది? ఇంటికి చేరుకోవాలి రైలు వస్తే బాగుండును."

కళ్లు లోతుగా పోయేయి. తల ఎండిపోయి చికిబికిగా ఉంది. పిచ్చి ఆకారం జాగ్రత్తగా స్వగ్రామంలో దిగి వెడుతుంటే స్నేహితులు, "ఎక్కడికి వెళ్ళేవ్? ఏమిటి విశేషాలు? మీ నాన్న వెతుకుతున్నాడు," అన్నారు. ఇదేరకం ప్రశ్నలు చాలా వినిపించేయి. బరస్టైన సైకిలు మాదిరిగా ముందుకు సాగుతున్నాడు.

బావురుమంది తల్లి. నానా చీవాట్లు తిన్నాడు తండ్రిచేత. "పరీక్ష పోతే ఈసారి శ్రద్ధగా చదువు."

తల్లితండ్రులతో పాటు అత్మకూడా చెప్పింది. "ఇంతధనం ఖర్చుచేసి చదివిన దానికి కానీ తేలేక యెన్ని కష్టాలు పడ్డావో తెలుసా? "స్వగృహే పూజ్యతే

మూర్ఖః. అమ్మా బాబూ లేకపోతే యిప్పుడు నాగతి ?" అని తన ఆత్మ ప్రబోధించింది.

*  *  *  *

పాఠశాలలో చేరిన కొన్ని రోజులకు పాఠాలు మొదలుపెట్టేరు. "ఫెయిలైన లిస్టులో వాడవే ? ఇంక ఆ దర్జాలు మాను," అన్నట్టు చూస్తున్నారు యితరులు. "ఈ వేళ నీరసంగా ఉంది. రేపు తెల్లవారుఝామున లేచి తప్పకుండా చదువు ప్రారంభిస్తాను." శ్రద్ధగా చదవడానికని నిశ్చయించుకున్నాడు ఆవిధంగా.

తెల్లవారుకట్ల మూడుగంటలకు మెలకువ వచ్చింది. "మూడుగంటల నుండి చదువేమిటి ? హెల్తు పాడౌతుంది 4 1/2కు లేచి చదువుతాను." ముసుగు తన్ని పెట్టి పరున్నాడు.

కాకులు కూశాయి. కళ్ళాపులు పూర్తి అయ్యేయి. పందులు ఊరి వెలుపలకు బయల్దేరేయి. కాఫీహోటలుకు చరచరా నడుస్తున్నారు. ఎండ ప్రకాశంగా ఉంది.

"ఇంత ఎండఎక్కిన తరువాత చదువేమిటి ? సుఖంగా స్నానం చేసి, భోజనం చేసి హోమ్‌వర్క్ చేసి స్కూలుకి వెళ్ళిపోతాను." అని అనుకున్నాడు.

ఎనిమిదిన్నర అయింది. లెక్కలు చేయటానికి కూర్చున్నాడు. లెక్కలు రావటం లేదు. విసుగెత్తుతున్నది. "స్కూల్లో అడుగుతాను." అనుకుని మూసి వేసేసేడు, స్నేహితులతో స్కూల్‌కి వెళ్ళేటప్పటికి ఫస్ట్ బెల్ అయింది.

"పాఠాలు జాగ్రత్తగా ఆలోంగి రాత్రి నుండి శ్రద్ధగా టైమ్‌టేబల్ ప్రకారం చదువుతాను."

సాయంత్రం అయింది. సినీమా మారింది. "ఈ వేళ సినీమా చూచి తెల్లవారుఝామున లేచి ఖచ్చితంగా చదువుతాను," అని ధృఢంగా అనుకున్నాడు.

రాత్రి పరుండేటప్పడికి పదిన్నర అయింది. తెల్లవారుఝామున చలిగా ఉంది. ముసుగునుండి, "చలిలో చదువేమిటి ? వెధవ పాఠాలెంతసేపు వస్తాయి? ఒక్కసారి జాగ్రత్తగా చదివితే వస్తాయి," అనుకున్నాడు.

యధాప్రకారంగా ముసుగునుండి లేచేటప్పటికి ఎనిమిదైంది. "ఈ వేళ 28 తారీకు ఒకటో తారీకు నుండి జాగ్రత్తగా ఏ రోజు పాఠాలు ఆ రోజు చదువుతాను. పరీక్ష ఇంకా ఆరుమాసాలుంది. ఈ లోగా చదవకేం నేమిటి ? దసరా క్రిస్టమస్ సెలవులు, శని ఆది వారాలు, బోలెడన్ని ! పేసవవచ్చు." అనుకున్నాడు.

అర్థపరీక్షలు వచ్చేయి.

"స్లిప్పులు పట్టుకువెళ్ళి వ్రాస్తాను. ఏన్యూల్‌కి శ్రద్ధగా చదువుతాను, ముమ్మాటికి."

అర్థపరీక్షలో స్లిప్పులు పట్టుబడుటచే పదులు, పదిహేన్లు మార్కులు వచ్చేయి.

"ఈ వేళ కాదు. రేపటినుండి చదవకపోతే ఒట్టు ! ఈ వేళ బద్ధకంగా ఉంది."

మర్నాడు. "ఈ వేళ రాత్రి ఆరుగంటల నుండి పన్నెండు, ఒంటిగంటవరకు, చదివేస్తాను, పాతవీ కొత్తవీ."

రాత్రి తలదగ్గిర దీపం... మంచంమీద పడక. గుండెలమీద పుస్తకం ఆన్చి చదువుతున్నాడు. కొంతసేపటికి పుస్తకం గుండెలమీద నిద్రపోయింది. నిశి రాత్రిలో ఎప్పుడో పుస్తకం ప్రక్కలో పడి నలిగిపోయింది.

బద్ధకంతో ఎనిమిది గంటలకు లేచి, "ఛా ! ఈ వేళ రాత్రి కూర్చుని చదువుతాను. పెద్ద పరీక్షలు దగ్గరకు వచ్చేయి. ఎక్కడేనా ప్రయివేటు పెట్టాలి," అనుకున్నాడు.

రాత్రికి చాపమీద కూర్చుని గోడకు జార్లపడి చదువుతున్నాడు. దీపం దేదీప్యమానంగా వెలుగుతోంది.

"నడుం లాగుతున్నది"

పుస్తకాలు తలక్రింద పెట్టి పరుండి చదువుతున్నాడు. కొంతసేపటికి హాయిగా, తెలియకుండానే, నిద్రపట్టింది.

పెద్దపరీక్షలు పదిహేను రోజులున్నాయి. "రాత్రులు టీ త్రాగాలి, లేకపోతే నిద్ర వస్తోంది," అని నిశ్చయించుకున్నాడు. రెండుగంటలకో అరకప్పు.

"టీ అమిత పైత్యం రాత్రి పడదు. కళ్ళు తిరుగుతున్నాయి. నిద్ర ఆగటం లేదు ఇన్ని పాఠాలున్నాయి. ఏం చదవను ? ఎప్పటికి వస్తాయి? ఒకటా, రెండా పాఠాలు?"

తెల్లవారుఝామున మూడు గంటలకు లేవడానికి అలారం పెట్టేడు. అలారం కొట్టగానే బద్ధకంతో లేచి, మంచం మీదనుండే దీపం హెచ్చించి చదువు సాగిస్తున్నాడు కళ్లు కూతలు పడుతున్నాయి.

"ఇప్పుడు కాదు. ఆరుగంటలకి లేచి చదువుతాను." దీపం ఆరిపోయింది, పుస్తకం తలగడ క్రింద పడింది.

పెద్దపరీక్షలు రేపటి నుండి !...



## జమీలా

(10 వ పేజీ తరువాయి)

కుర్తదప్పి, యిప్పుడావిడ, పూర్వం రజియా ఎలా తలవంచుక కూర్చుండేదో, అలా కూర్చోడానికి వొచ్చింది. పెళ్ళప్పుడు తనని ఎంతో వైభవోపేతంగాను, అంచక్కగాను అలంకరించి కూర్చోబెట్టారు. యిల్లంతాకూడా సంపెడితోనూ, విద్యుద్దీపాల కాంతి మెఱుపులతోనూ, శోభిస్తోంది. అందమైన స్త్రీలందరూ వింత వింతగా అలంకరించుకుని ఇటూ అటూ, పీతాకోకచిలుకలల్లే తిరుగుతున్నారు.

మంగళనినాదాలతో పెళ్ళికొడుకు, పెళ్లివారి బంగళా చేరుకున్నాడు. ఏనుగపై బంగారపు టంబారిమీంచి దిగుతూ... అతన్ని నవాబు బంధుమిత్రసమేతంగా ఎంతో గౌరవంతో, వైభవంతో ఎదుర్కొన్నాడు. పెళ్లికొడుకుచుట్టూ ఎఱ్ఱటి కుళాయి—కోటులు తొడుగుకుని, పచ్చటి తలపాగా చుట్టుకున్న యువకులంతా ఎంతో మంది గుమిగూడి వున్నారు. వెనుకనుంచి బోయీలచేత పల్లకీలు మోయించుకుని వాటిలో స్త్రీజనమంతా ఘోషాపద్ధతిలో తరలి వస్తుంది....

ఆఘెవాళ్ళముతాలో జిక్కిన పెళ్ళికొడుకు కోతిచేజిక్కిన వింత వస్తువు మాస్తరుగా పరిగణింపబడ్డాడు. వారంతా అతన్ని యిష్టంగా గేలిచేస్తున్నారు. ఇప్పుడు జమీలా తనకు కాబోయే భర్త ముఖస్వరూపాన్ని తిలకించవలసివుంది...గుండె ఒణికిపోతూవుంది. ముచ్చెమటలు పోస్తున్నాయి. విశాలమైన, కలువరేకుల్లాంటి ఆ కళ్లు పెనుగంబడి ఆత్రంతో ఉద్రేకంతో కూడిన ప్రగాఢచాయలు స్పష్టంగా అగుపిస్తున్నాయి.

నేలమీద ఓ పెద్దగుడారం పరచారు. ఓ పక్కగా తెరతో ముఖం పూర్తిగా కప్పబడిన జమీలాను ఆవిడకు ఎదంగా సన్నమల్లెల సరాలతో ముఖం కప్పివేయబడిన పెళ్లికొడుకును కూర్చోబెట్టారు. ముందు ఓ పెద్ద అద్దం వుంచుతూ, వాళ్లిద్దరికీ ముఖంమీద కట్టిన తెరల్ని ప్రక్కకు తీసేశారు. చుట్టూ ఆఘెముగా అంతా కిలకిలమని నవ్వుతూ గోలెడుతూంటే జమీలా ఎంతో సిగ్గున, నయిస్తూ— మెల్లి మెల్లిగా తలెత్తి అద్దంలో ప్రతిబింబితమైన తన 'భర్త' ముఖబింబాన్ని చూసింది. చూడ్డం తడువు ఆమె కళ్ళకి గాఢాంధకారం కమ్మినట్లయింది! బ్రహ్మ—మైలుపట్టాల మీది చక్రాల్లా గిరగిర తిరుగజొచ్చింది.

మళ్ళీ శాంతతకొచ్చినప్పుడు ఆరూపం— అబ్బో ఆ ముదిమిరూపమే, ఇంతకు పూర్వం తను ఎక్కడో, ఎప్పుడో చూసినట్లు అతి స్పష్టంగా తోచింది...ఎప్పుడో?... ...ఎక్కడో?—దప్పున రజియా పెళ్లి మాట జ్ఞాపకం వచ్చింది! వరవరా లుడికిపోయి ముఖం వివర్ణమైపోయింది. హృదయం సుడిగుండంలోని చిగురాకువలె విలవిలమంటూ తన్నుకుంటూవుంది. పూర్వపు సంఘటనలన్నీ ఒక్కొక్కటే స్మృతిపథానికి వస్తున్నాయి. జమీలా అలా కళ్ళుమూసుకూర్చుంది...ప్రక్కన పెళ్ళికొడుకు తన కోటుకు ఘుమాయించుకున్న సెంటువాసనతో తల గిర్రున తిరిగిపోతోంది.

"నువ్వు చింతించక్కర్లేదుగాని, నీకు పెళ్ళియీడొచ్చినప్పుడు, ఎర్రగా బుర్రగావుండే మాంచి నవాబు కుఱ్ఱాళ్లను తెచ్చే నీకు ముడిగడతాం. ఊరుకో" అంటుంది తల్లిస్వరం, రెండు చెవుల్లోనూ, హృదయాంతరాళంలోనూ కూడా.

పెద్దపెద్ద అశ్రుబిందువులు జమీలా కళ్ల కొలుకులనుంచి చెంపలమీదికి దిగజారి వర్షాపాతంగా మారి ఆవిడ ఎప్పుడో కట్టుకున్న ఆశాసౌధాల్ని కూల్చి కుప్పజేశాయి. ...పాపం, జమీలా!

---

## దాగిన ద్వేషం

(15-వ పేజీ తరువాయి)

పదివేల రూపాయలు ఇవ్వడానికి నిశ్చయించుకున్నారు. ఆయన కబురింకా మీకు అందలేదా?"

"లేదే. అదేమిటండీ? నాకు చిల్లిగవ్వైనా ఇవ్వనని చెప్పి, పైన నాపైన కేసు పెడతానని కూడా ఆయన బెదిరించారే! ఇప్పుడిలా చెప్పడంలో అర్థం?"

"ఏముంది? ఆపదలో చిక్కుకున్నాడు. ఇంక పగలు తీర్చుకోడానికి ఆయనకి మనసు లేదు. అంతే."

"అయినా అది నాకువద్దు. బాబూ, వస్తు. నా బతుకంతా ఎలాగూ మొదటి కొచ్చింది. నా దారి నేనే చూసుకుంటాను. ఈ వూళ్ళో నే ఏదో చిన్న వ్యాపారం పెట్టుకోవాలనుకుంటున్నాను. నాకింక ఆయనతో ఎటువంటి సంబంధమూ వద్దు."

"అంకరాజుగారూ, ఇవన్నీ నా వద్ద చెప్పకండి. మీ కొకమాట గట్టిగా చెప్పగలను. దుర్గయ్యగారు తప్పకుండా విడుదలౌతారు. ఆయనమీద కేసు నిలవదు. మీరు మాత్రం సత్యనారాయణని కాపాడలేరు. మీ రిక్కడనించి ఎక్కడికి వెళ్లినా పోలీసులకి దొరక్కపోరు. ఇంత పెద్ద సంసారాన్ని పెట్టుకుని ఎక్కడ దాక్కోగలరు? మీకు పార్వతమ్మగారిచ్చే ధనం కంటే పదివేల రూపాయలు అధికమే. అదీ కాక మీకు చిక్కులుకూడా ఉండవు. ఆలోచించుకోండి."

అంకరాజు వొణికిపోతున్నాడు. "అయ్యా ఇందులో నా తప్పేమీ లేదు. ఎవరు ఎటువంటివారో నాకు తెలియదు. నాకు పార్వతమ్మగారు ధన మివ్వచూపలేదు..."

"అబద్ధం ఆడకండి. మీ కోసమే చెప్తున్నాను."

ఇంక అంకరాజుకి నోరు పెగల్లేదు.

మాధవరావు లేచాడు. వెడుతూ గుమ్మం వద్ద నిలబడి అన్నాడు. "వాళ్లు మీ కివ్వచూపుతున్న మీ చేతికి రాదు ఇది నిజం. మీ కే అర్థమౌతుంది. మీ మేలు మీరు తెలుసుకోగలిగినట్లయితే ఆ రాత్రి సత్యనారాయణ, పార్వతమ్మ మీ యింటికి వచ్చినట్లు కోర్టులో సాక్ష్యం ఇస్తారు. లేదా మీరు చేతులారా నెత్తికి చిక్కులు తెచ్చుకుంటున్నారు."

అంకరాజు లేచి నిలబడినవాడు జంపకానా పైన మెల్లిగా చతికిలపడ్డాడు. ఒళ్లు బరువంతా చేతిమీద ఆన్చి జంపకానావంక చూస్తూ కూచున్నాడు. కాని చెయ్యి వొణికింది. పక్కకి జరిగి గోడకి చేరగిలపడ్డాడు. ఇంక ఊరువిడిచి పోవడానికి ధైర్యం చిక్క లేదు. మూటలుకట్టిన సామానులన్నీ విప్పబడ్డాయి.

[ఇంకా వుంది]

---

# పట్నవాసం

(13-వ పేజీ తరవాయి)

"సాహిత్యం మెదడుకు మంచి దంటారు నిజమేనా?"

"అయితే అవునేమో గాని ఈ వీధుల్లో గాలికి ఎగురుతూ ఉండే పత్రికలు తింటే నమ్మకంగా జబ్బు చేస్తున్నది."

"అదేమిటి? సెక్సు పత్రికలూ, సినిమాపత్రికలూ చాలా సరదాగా ఉంటాయిటగా?"

"మొదట బాగానే ఉంటుంది గానిరాను రాను తిండిమీద హితవుకూడాపోతుంది."

"నా చిన్నతనంలో పుస్తకాలుండే వంటే అందులోచాలా మంచిసరుకుండేది. వాటిమీద గౌరవం ఉంచి జాగ్రత్తగా దాచుకునేవాళ్లు. అందుచేత అతిగా తిన టాని కుండేదిగాదు. ఒక్కొక్క పుస్తకంలో ఒక్కొక్క మాధుర్యం ఉండేది. ఇప్పుడీ పత్రికలు తేరగా దొరుకుతున్నా యనీ, అవతల సరిఅయిన తిండిఅందటం లేదనీ అతిగా తింటే జబ్బులు చేసుకొస్తు న్నాయి. అదీ కాక- ఏంపత్రికలు?- అన్నీ ఒకటిగానే ఉంటాయి. ఒక దానిరుచే రెండో దానికిన్నీ!"

"ఈపత్రికలు తినటంలో అంతో ఇంతో విషం ఉంటుందేమో అనుకుంటా. మాస్నేహితుడొకడు పత్రికదొరికితే పంటకొరక కుండా పోనివ్వడు. అదేమిటోయంటే అందులో మజాఉంది లెమ్మంటాడు."

మామా, పట్నంబావాకూడా ఈ సంభాషణలు అంత దూరంనుంచే విన్నారు. మామ ఒక్కడుగు ముందుకు వేయటం చూసి, "మనకెందుకు, పోదాం పద, బావా," అన్నాడు పట్నంబావ.

"ఓరి ఉండరా! మీపట్నం వాళ్లకున్న తెగులే ఇది. ఎవరికీకాని సంభాషణలు ఆసక్తిగా వింటారు. నలుగురు బుద్ధిమంతులు కూడుని పనికొచ్చేమాటలు మాట్లాడుకుంటే వినలేరు. వాళ్లుమాడు, ఎంతమంచి విషయాలు చెప్పుంటున్నారో!" అన్నాడు.

"వాళ్లు రాజకీయాలు మాట్లాడేవాళ్లు," అన్నాడు పట్నంబావ.

"అంటే?"

"సంఘాన్ని గురించీ, ప్రభుత్వాలను గురించీ, పరిపాలన గురించీ మాట్లాడతారు."

"మాట్లాడనీ, విందాం, తప్పేం?" అన్నాడు మామ.

"ఏమిటో ఈ రాజకీయాలు—" అని పట్నం బావ నసుగుతుండగానే వినిపించు కోకుండా బైతుమామ ముందుకు వెళ్లిపోయినాడు. పట్నంబావ ఆయన్ని అనుసరించక తప్పిందికాదు. (ఇంకావుంది.)




బాలగేయం:

# గాలిపడగ

శ్రీ పి. ఎస్. నారాయణ

గాలిలో ఎగరేయ
  నా గాలిపడగా,
తేలుతూ పోయింది
  నా గాలిపడగా.
పిల్లగాలుల లోన
  నా గాలిపడగా,
మెల్లగా ఎగిరింది
  నా గాలిపడగా.
నింగిపై కెక్కింది
  నా గాలిపడగా,
నృత్యాలు చేసింది
  నా గాలిపడగా
మేఘాల చాటునా
  నా గాలిపడగా,
మెరుపుతీగను కలిసె
  నా గాలిపడగా.

(ఇంతలో)
సుడిగాలులూ వీవ
  నా గాలిపడగా,
గడగడా లాడింది
  నా గాలిపడగా.
తూఫాను చెలరేగ
  నా గాలిపడగా,
టుప్పునా తెగిపోయె
  నా గాలిపడగా.
ఆకాశమార్గాన
  నా గాలిపడగా,
అదృశ్యమైపోయె
  నా గాలిపడగా,

—




జి. బి. భొట్లు

పూర్వం ఒక రాజుండేవాడు. ఆయనకి బోలెడుమంది కొడుకు లున్నారు. వాళ్లందరూ ఏమీ పనిచేయకుండా ఇంట్లో కూచ్చుని మేస్తుంటె రాజు పోషించలేకపోయాడు. 'మీ బతుకు తెరువు మీరు చూసుకోండి' అని అందరికీ చెప్పాడు రాజు.

అందులో అందరికంటే చిన్నవాడు మణికర్ణుడు. అతడు ఇంటి నుండి బయలుదేరి వెళ్లగావెళ్లగా ఒక అడవిని చేరుకున్నాడు. అక్కడ ఒక మాదిగవాడు కర్ర చెప్పలు చేస్తున్నాడు. వాడిదగ్గిరికి వెళ్లి మణికర్ణుడు "నాకు ఆకలిగా వుంది. ఆహారం పెట్టగలవా?" అని అడిగాడు. "లోపలికి వెళ్లి నాభార్య నడుగు." అన్నాడు మాదిగవాడు. ఆమె నడిగితే, "అయ్యో, ఇప్పుడే పొయ్యి ఆర్పేశాను. మళ్లీ వెలిగించటానికి కట్టెలు లేవు." అన్నది.

మణికర్ణుడు ఆపక్కన మాదిగవాడు తయారుచేసివుంచిన కర్ర చెప్పలను విరగగొట్టి అవి వెలిగించి వంట చెయ్యమన్నాడు. అవి విరగగొట్టినందుకు వాటి ఖరీదును ఇచ్చేస్తా నన్నాడు. ఆ రాత్రికి హాయిగా అన్నం తిని అక్కడే పడుకున్నాడు.

మర్నాడుపొద్దునే లేచి అడవిలోకి వెళ్లి కట్టెలు కొట్టి తెచ్చాడు మణికర్ణుడు. వాటితో చెప్పలు తయారుచేసి మాదిగవాడి చెప్పలతోపాటుగా పెట్టాడు. మాదిగవాడు ఇంటికి వచ్చి చూసేటప్పటికి ఆ కొత్తచెప్పలు కనిపించాయి. అవి తను చేసినవాటికంటె ఎన్నోరెట్లు బాగున్నాయి. వాటిని తీసుకువెళ్లి పక్కనున్న పట్టణంలో అమ్మితే చాల ఖరీదు వచ్చింది. ఈ లాభం చూసి మాదిగవాడు మణికర్ణుడిని తనవద్దనే ఉండమన్నాడు.

ఇలా కొన్నాళ్లు మణికర్ణుడు అక్కడే వున్నాడు. ఒకరోజున చేయవలసిన చెప్పలన్నీ చేసిన తరవాత, ఇంకా కొయ్య కొద్దిగా మిగిలింది. దానితో నాలుగు పెద్ద చిలకబొమ్మలని చేశాడు. వాటికి చక్కగా చిలకరంగులే వేసి బయట ఆరబెట్టాడు.

ఆ రాత్రి కొందరు గంధర్వులు ఆకాశమార్గాన వెడుతున్నారు. కర్రచిలకల్ని చూసి 'ఇంత అందమైన చిలకలికి ప్రాణంవుంటే ఎంత బావుంటుంది.' అనుకుని వాటికి ప్రాణంపోశారు. తెల్లవారి తలుపు తీసేటప్పటికి ఆ చిలకలు ఇంట్లోకి ప్రవేశించాయి. మాదిగవాడి భార్యకి కోపం వచ్చింది. "నీకే కాకుండా ఈ చిలకలికికూడా ఎవరు తిండిపెడతారు. పో, పో." అని మణికర్ణుడిని వెళ్లగొట్టింది.

మణికర్ణుడు చిలకల్ని తీసుకుని ఒక గ్రామం వెళ్లాడు. చిలకలు అరణ్యంలోకి వెళ్లి పళ్లు, కాయలు తెచ్చిఇస్తూండేవి. అతను హాయిగా కొన్నాళ్లిలా కాలక్షేపం చేశాడు. ఒకరోజున అతనికి ఒక చక్కని కలవచ్చింది.

సప్తసముద్రాల అవతల ఒక దేశం. ఆ దేశపు రాజుకి ఒక కుమార్తె. ఆమె భవనంచుట్టూ ఏడు కందకాలు. వాటి అవతల ఏడు కంచెలు. ఆ కంచెలన్నీ శూలాలతో నిండివున్నాయి. ఆ కంచె

ను దాటి క దశాలను దాటి భవన లోకి వెళ్లినవానికి రాజకుమార్తె నిచ్చి పెళ్లిచేస్తా వని రాజుగారు చాటి చారు ఎందరో రాజకుమారులు ఆ క దశాలు క చెలు దాటలేక మరణిస్తున్నారు

మణికర్ణుడు నిద్రలేచి చూశాడు ఇది కలా నిజమా అనుకున్నాడు బిగ్గరగా పైన చెట్టు మీద కూచున్న చిలకలు ఏమిటని అడిగాయి మణికర్ణుడు తన కల వృత్తా త చెప్పాడు ఆ కల నిజమే మేము నిన్ను అక్కడికి తీసుకువెడతాము అన్నాయి చిలకలు

మణికర్ణుడు చిలకలపై ఎక్కి కూర్చుని ~ప్తసముద్రాలు దాటి ఆ దేశ చేరుకున్నాడు ఆ క దశాలు క చెలు తను దాటగలనని రాజుతో చెప్పాడు ఆ సమయ లో రాజదర్బారులో తెర చాటున కూర్చున్న రాజకుమారి హేలాదేవి మణికర్ణుని చూసి ది చూసి అతని అ దానికి ముగ్ధురాలై ప్రేమి చి ది ఇతడు ఆ క దశాలు క చెలు దాటగలిగితే నేను అదృష్టవ తురాలిని అనుకున్నది

మణికర్ణుడు ఆరుక చెలు దాటాడు ఎడవక చె దాటుతు డగా ఆయాస వచ్చి శూలాల మీద డి మరణి చాడు ఈ సగతి తెలిసి హేలాదేవి అయ్యో నేను ప్రేమి చిన యువకుడు చనిపోయాడు అతనిని ప్రేమి చాను గాబటి అతడే నా భర్త అని దుఃఖ చి ది రుగున వెళ్లి మణికర్ణుడి శవ పై పడి ఎడ్చి ది

రాజు ఇద తా చూసి కో గి చాడు ముక్కు మొహ ఎరగని ~రదేశి యువకుడు చనిపోతే ఇ త దుఃఖ స్తావా దుష్టురాలా! అన్నాడు నే శవమైనా ఈ యువకుడి భార్యనే. నే నిక మరెవ్వరినీ పెళ్లాడను అన్న దామె

రాజు మ డి డి ఈ శవ తో పాటు హేలాదేవినికూడా అరణ్య లో వదలిపెట్ట ర డని ఆజ్ఞా చాడు హేలాదేవి ఒక చెట్టు కి ద కూర్చుని మణికర్ణుడి శవ పె ~డి దుస్తున్నది ఇది చూసి మణికర్ణుడి ~లకలు మేము మణికర్ణుడి బతికి చగల అని ఓదార్చాయి.

చిలకలు వె టనే ఎగిరిపోయి అక్కడికి వెయ్యి యోజనాల దూర లో వున్న చిలకల ~ర్వ~ ముకు వెళ్ళి అక్కడను డి మృ~ సజీవని అనే ఒక దివ్య ఔ~ ధాన్ని తీసుకువచ్చాయి

హేలాదేవి సజీవనిర~ మణికర్ణుడి కళ్లలో డగానే అతడు నిద్రను చి లేచినట్టు లేచి కూర్చున్నాడు అప్పుడు వారిద్దరూ తిరిగి

(46 వ పేజీ చూడ డి)



# కోడిగుడ్డంత బార్లీ గింజ

శ్రీ దాసరి జనార్దనరావు

ఒకనాడు కొంతమంది పిల్లలు ఒక కొండలోయవద్ద ఆడుకుంటున్నారు. అక్కడ వాళ్లకి ఒక కోడి గుడ్డువంటిది ఏదో ఒకటి దొరికింది. కాని దానికి అడుగున చీలిక వంటిది ఒకటి ఉండటం మూలాన అది ఒక గింజలాగా కూడా వుంది. ఆ పిల్లలు దానితో ఆడుతూ వుంటే దోవన పోయే ఒకాయన దానిని చూచి వాళ్ళ చేతుల్లో ఏదో కొంత పెట్టి దానిని తీసుకు వెళ్లి ఆ దేశం రాజుగారికి వింత వస్తువు క్రింద బహూకరించాడు.

ఆ రాజు దానిని చూచి, కొంత మంది పండితులను పిలిపించి అది కోడుగుడ్డో, లేక ఇంకా ఏదైనా గుడ్డో, ఏదైనా ధాన్యపు గింజో, చెడగొట్టకుండా తెలిసికోమని అన్నాడు. ఆ పండితులందరూ పరిశీలించి చివరకు ఇదమిత్థమని తేల్చలేక పోయారు.

వారు దానిని తీసుకువెళ్ళి ఒక కిటికీవద్ద పెట్టి ఆలోచిస్తున్నారు. ఇంతలో ఒక కోడిపెట్ట దానిమీద కెగిరి దానిని ముక్కుతో పొడిచి తినటం మొదలుపెట్టింది. అందువ

అది కోడి గుడ్డు గాని, **మరి** ఏ గుడ్డు గాని కాదనీ, అది ధాన్యపు గింజ అనీ తెలుసుకున్నారు. ఈ సంగతిని ఆ పండితులు పోయి రాజుగారికి తెల్పారు. అది ఒక బార్లి గింజ అని కూడా తేల్చారు.

రాజుగారికి ఆశ్చర్యంవేసింది. వెంటనే "ఆ గింజను ఏ దేశంలో, ఎప్పుడు, పండించారో తెలుసుకోండి" అన్నాడు. పండితులు పుస్తకాలు వెదికారు. ఎక్కడా అంతు దొరకలేదు. చివరికి వాళ్లు రాజు కడకు పోయి "రాజా మాకు పుస్తకాల్లో ఎక్కడా దాని విషయం కన



పడలేదు. ఎవరినైనా ముసలి రైతుల్ని పిలిపించి అడిగితే తెలియగలదు." అన్నారు.

రాజు ఒక ముసలిరైతుని సభకు పిలిపించాడు. ఆ రైతు బోసివాడు. నడుం వంగిపోయి కర్రతో అతి కష్టంమీద నడిచి వచ్చాడు.

రాజు ఆ గింజను రైతుకి చూపాడు. రైతుకి చూపుకూడా సరిగా లేదు. కళ్లు చిట్లించుకుంటూ దానిని చూచాడు. రాజు రైతుని "తాతా, ఇల్లాంటి గింజను నీవు పొలంలో ఎప్పుడైనా పండించావా లేక ఇతరులు పండించగా ఎప్పుడైనా చూచావా?" అని అడిగాడు.

రైతుకి చెవుడు కూడా. కష్టంమీద ఎల్లాగో విన్నాడు. విని నాకు తెలిసినంత వరకూ నేనెన్నడూ ఇల్లాంటిది పండించలేదు. చూడలేదు కూడా. కావలిస్తే మా నాన్నను అడిగితే తెలియవచ్చు." అన్నాడు రైతు.

రాజు ఆ తాత నాన్నని పిలిపించాడు. ఆ తాతనాన్న తాతవలె కాకుండా కర్ర లేకుండానే కొద్దిగా వంగి నడుస్తూ వచ్చాడు. రాజు ఆ గింజను గూర్చి అడిగాడు. తాత కన్నా తాతనాన్నకి త్వరగా వినపడింది రాజుమాట. తాత-నాన్న "రాజా నేనెన్నడూ పండించలేదు ఇల్లాంటి దాన్ని. మా రోజుల్లో ధాన్యం కొనటం అంటూ ఉండేది కాదు. మా రోజుల్లో ఈ రూపాయలు లేవు. ఎవడికి కావలసిన ధాన్యం వాడు పండించుకునేవాడు. ఇంకా ఇతర వస్తువులు కావాలంటే ఇచ్చి పుచ్చుకోవటాలు ఉండేది. మా రోజుల్లో మేము పండించే ధాన్యపు గింజలు ఇప్పటికన్నా చాలా పెద్దవిగా వుండేవి. బోలెడు పిండి అయ్యేది. ఎంతో రుచిగా

కూడా వుండేది. అయినా ఇంత పెద్దగింజని నేను కూడా చూడలేదు. కాని మా నాన్నకి తెలిస్తే తెలియచ్చు. ఆయనను పిలిపించి అడగండి బాబూ" అన్నాడు.

రాజు ఆతాత-తాతని పిలిపించాడు సభలోకి. ఆతాత-తాత నడుం వంగినా చరచరా నడుస్తూ సభలోకి వచ్చాడు. అతని మనుమడి కన్నా దృష్టి బాగానే వుంది. మాటలు కూడా మనుమడికన్నా స్ఫుటంగా పలుకుతున్నాడు. రాజు ఆ ధాన్యపు గింజని తాత-తాతకి చూపించాడు.

తాత-తాత దానిని చూచి "ఎన్నాళ్లైయ్యిందీ, ఇల్లాంటి ధాన్యపు గింజను చూచి!" అన్నాడు. కొద్దిగా గిల్లి నోట్లో వేసుకుని చప్పరించి చూచాడు. "ఆ సరిగ్గా ఇల్లాంటిదే" అన్నాడు.

రాజు "మరైతే, తాతా! ఎక్కడ ఎప్పుడు ఇల్లాంటి దానిని పండించారు? నీవు స్వయంగా పండించావా? ఎవరివద్దనైనా కొన్నావా" అని అడిగాడు.

తాత-తాత "మా రోజుల్లో ఇల్లాంటి గింజల్ని ఎక్కడ పడితే అక్కడ, ఎవ్వరు పడితే వారు పండించేవారు. నేను ఇల్లాంటి గింజల్ని తినే బ్రతికాను. ఇల్లాంటి గింజల్ని పండించే వాణ్ణి." అని సమాధానం చెప్పాడు.

రాజు "మరి వీటిని ఎక్కడ నుంచైనా కొనటం కూడా జరిగేదా" అని అడిగాడు.

తాత-తాత నవ్వి "మా రోజుల్లో ధాన్యం కొనటం, అమ్మటం అంటే మహా పాపం. మాకు డబ్బు అంటే ఏమిటో తెలియదు. ఎవరికి కావలసిన ధాన్యాన్ని వాళ్లం పండించుకునే వాళ్ళం." అన్నాడు.

రాజు "మరి తాతా! నీ పొలం ఎక్కడ వుండేది చెప్పు" అని అడిగాడు.

"నా పొలం అంటూ ఏమీ ఒకటి ఉండేది కాదు. భూమి నంతటినీ ఎవరు పడితే వారు దున్నుకోవచ్చు. ఎవడు ఎంత కష్టపడగలిగితే అంత" అన్నాడు తాత.

"అయితే మరి నాకు ఈ రెండు విషయాలు చెప్పగలవా? ఒకటి. ఇప్పుడు పూర్వం అంతటి పెద్దగింజలు పండటం లేదేమిటి? రెండు నీ పళ్ళు ఊడలేదు, నీ మనుమడి పళ్లు ఊడిపోయాయి. నీ దృష్టి బాగా వుంది. నీ మనుమడికి కళ్ళజోడు వచ్చింది. వీటికి కారణమేమిటి" అని రాజు తాత-తాతని అడిగాడు.

తాత-తాత ఇలా సమాధానం చెప్పాడు. "ఇప్పుడు మానవుల్లో అసహజత్వం, కృత్రిమం పెరిగిపోయింది. పైర్లు పెంచటంలో కూడా అసహజత్వం ఎక్కువైంది. అశ్రద్ధ హెచ్చింది. వ్యవసాయానికి పూర్వపు గౌరవం తగ్గింది. భూమిలో బలం తగ్గిపోయింది. అందువల్ల గింజ చిన్నదై పోయింది.

ఇక నేను నా వయస్సుకి నా మనుమని కన్నా బలంగా వుండటానికి కారణం;—ఇప్పుడు మనుష్యులు తాము స్వంతంగా కష్టపడి పని చెయ్యరు. తోడివాని ధాన్యం మీద ఆధారపడి వుంటారు. తోడివాని ఆస్తిని అనుభవిస్తారు. తాము కష్టపడరు. కష్టపడిన వానిని అనుభవించ నియ్యరు. ఒళ్లు వంచి పని చెయ్యటం నీచమని తలుస్తారు. మేము ఎవరికి కావలసినది వారు కృషిచేసి సంపాదించుకునేవాళ్ళం. చెమటోడ్చి శ్రమచేసేవాళ్ళం. ఇతరులమీద ఆధారపడేవాళ్ళం కాము. ఇప్పటికాలపు చచ్చు నాగరికత అప్పుడు లేదు. అందుకనే నేను నా వయస్సుకి నా మనుమడి కన్నా మెరుగుగా వున్నాను." అని తాత-తాత ధీమాగా జవాబిచ్చాడు.

రాజూ, సభికులూ, విని నిజ విషయాన్ని తెలుసుకున్నారు-

(టాల్‌స్టాయి కథకు తర్జుమా)

---

బొమ్మరిల్లు సీరియల్:




ఆరోజు రాత్రి టామ్, సిడ్ తొమ్మిదిన్నరకల్లా పక్కల మీదికి చేరారు. సిడ్ ఇట్టే నిద్రపోయాడు. టామ్ నిద్రపోలేదు. దేనికోసమో కాసుకు కూచున్నాడు. చాలావిసుగ్గా వుంది అల్లా మేలుకుని వుండటం. ఇక తెల్లవారిపోతోం దనుకున్నాడు టాం. కాని ఇంతా ఏడిస్తే గడియారం పదిగంటలు కొట్టడం మొదలెట్టింది. భలే కోపంవచ్చింది టామ్‌కి గడియారం మీద.

నెమ్మదిగా వూరంతా నిశ్శబ్దమైంది. గడియారం టిక్కు టిక్కు శబ్దం బిగ్గరిగా వినిపిస్తోంది. మేడ మెట్లమీద ఏదోచప్పుడయింది. పోలీ పెద్దమ్మ గదిలోంచి గుర్రు చప్పుడు భయపెడుతోంది. దూరంగా కీచురాళ్లు 'గీ' మంటున్నాయి. టామ్‌కువళ్లు జలదరించింది. దెయ్యాలు లేచి తిరుగుతున్నా యనుకున్నాడు.

ఎంతసేపటికీ టైము గడవటం లేదు. చివరికి టామ్‌కి తెలియకుండానే నిద్ర వచ్చేసింది. మెడ వాల్చి నిద్రపోయాడు. గడియారం పదకొండు కొట్టడం టామ్ విననే లేదు.

ఇంతలోకే టామ్ పడుకున్న గది బయటి కిటికీని ఎవరో తెరిచారు. "ఒరే! టాం! లే! నిద్రపోతున్నావా?" అని ఎవరో పిలిచారు. టామ్‌కి మెలుకువ వచ్చి గబుక్కున లేచి లాగూ, కోటూ తొడుక్కున్నాడు. కిటికీగుండా దూరి బయటికి వచ్చాడు. అక్కడ హాకల్ బెరీ ఫిన్. నుంచున్నాడు. చచ్చిన పిల్లి వుంది. వాడి చంకలో ఇద్దరూ చప్పుడు చేయకుండా పాకుకుంటూ ఇల్లు దాటి రోడ్డుమీద పడ్డారు.

మరో అరగంటకల్లా శ్మశానానికి చేరుకున్నారు. అది వూరికి మైలున్నరదూరం వుంది. శ్మశానమంతా రాళ్లు, రప్పలు పొదలతో నిండి జీబురుమంటోంది. చాలాసేపు వెదికి వెదికి చివరికి తమకి కావలసిన గోరీని కనిపెట్టారు. అది ఈ మధ్యనే చచ్చిపోయిన హాస్ విలియమ్స్ గోరీ. ఆ గోరీకి ఒక పక్కన మూడు పెద్ద పెద్ద రావి చెట్లు ఉన్నాయి. వాటి చాటున దాక్కున్నారు టామ్, ఫిన్.

ఆకులు గలగల మన్నాయి. దెయ్యాల గుసగుస లనుకుని టామ్ తుళ్లిపడ్డాడు.

"ఒరే, హాక్! దెయ్యాలు మన్ని చూస్తే ఊరుకుంటాయ్రా ?" అని చెవిలో నెమ్మదిగా అడిగాడు టాం.

"ఏమోరా, నాకు భయంగా వుంది."

"హాస్ విలియమ్సుకి మన మాటలు వినబడతాయా ?"

"వాడికి వినబడకపోయినా వాడి దెయ్యానికి వినబడవచ్చు." అన్నాడు హాక్, వణుకుతూ.

కాసేపు టామ్ మాట్లాడ లేదు.

"ఒరేయ్ ఫిన్. మనం హాస్‌ని 'వాడు, వీడు' అనగూడ దనుకుంటా. 'హాస్‌గారు' 'ఆయన' అని అనకపోతే వాడికి కోపం రావచ్చు."

"ఆ, వాడు చచ్చిపోయాడుగా.

చచ్చిపోయింతరవాత 'గారు' అనక పోయినా ఫరవాలేదు." అన్నాడు హక్.

మళ్లీ కాసేపు నిశ్శబ్దం. పటుక్కుని టామ్ స్నేహితుడి చెయ్యి పట్టుకున్నాడు.

"ష్, ష్"

ఒకళ్ల నొకళ్లు గట్టిగా పట్టుకున్నారు.

"ష్. ఏమిట్రా ఆ చప్పుడు."

"బాబోయ్. దెయ్యాలొస్తున్నాయి రా, టాం! ఏం చేద్దాం యిప్పుడు?"

"మన్ని చూస్తాయంటావా హక్?"

"ఓ. చీకట్లోగూడా బాగా చూడగలవు దెయ్యాలు. నేను రాకుండావుంటే బావుండేది."

"భయపడకురా కదలకుండా కూర్చుందాం. మనం వాటికేమీ అపకారం చెయ్యటం లేదుగా. మనకి అవిమాత్రం ఎందుకు అపకారం చేస్తాయి?"

ఇద్దరూ ఊపిరి బిగపట్టి వింటున్నారు. మూడు ఆకారాలు నెమ్మదిగా గోరీవద్దకు వచ్చాయి. ఏదో వెలుతురు కనిపించింది. దెయ్యాల దగ్గర అల్లాంటి వెల్తురు వుంటుందని హక్ టామ్‌చెవిలో చెప్పాడు.

"టాం! నీకు ప్రార్థనపద్యాలు వచ్చా?"

"మరిచిపోయాను. జ్ఞాపకం చేసుకోనా?"

హక్ తలెత్తి చూశాడు.

"ఒరేయ్, వాళ్లు మనుషులేరా" అన్నాడు. టామ్ ఇంకా కళ్లు గట్టిగా మూసుకున్నే, "నీకెల్లా తెలుసు?" అన్నాడు.

"అందులో ఒకడు మఫ్ పాటర్ లాగా వున్నాడు. ఆ గొంతుక కూడా వాడిదే. తాగుబోతువెధవ తూలుతూ వస్తున్నాడు."

"మరేరా. అవును పాటర్‌గాడే వాడు. ఆ పక్కన వున్నది ఇంజన్ జో. వాడు బోలెడు హత్యలు చేశాట్ట."

ఆ ముగ్గురు కొత్తవాళ్లు ఈ పాటికి గోరీదగ్గరికి వచ్చేశారు. అందులో ఒకడు డాక్టర్ రాబిన్సన్. ఆయన లాంతరుపట్టుకున్నాడు. పాటర్ చేతులో గడ్డపలుగు, పార వున్నాయి. పాటరు, ఇంజన్ జో కలిసి శవాలు మోసుకుపోయేందుకు ఉపయోగించే 'పాడె' మోసుకొచ్చారు. దాన్ని గోరీపక్కన పడేశారు. ఇద్దరూ గోరీని తవ్వటం మొదలెట్టారు. డాక్టర్ రాబిన్సన్ దీపాన్ని ఆపక్కన పెట్టి టాం, హక్‌లు దాక్కున్న రావిచెట్టుమొదట్లో చదికిలపడ్డాడు. కాని కుర్రాళ్లిద్దరూ అవతలవేపున ముడుచుకుని కూచ్చోటంమూలాన ఎవరికీ కనిపించలేదు.

"ఏయ్, దబ్బున కానివ్వండి. వెన్నెల రాకముందే పని జరిగిపోవాలి." అన్నాడు డాక్టరు.

వాళ్లిద్దరూ గొణుక్కుంటూ గోరీని తవ్వేశారు. అందులోంచి శవాన్ని తీసి పాడెమీద పడేసి తాళ్లతో బిగించి కట్టారు. అంతా అయింతరవాత పాటరు,

"ఏమయ్యోయ్ డాక్టరూ! ఇదిగో నీ పని పూర్తిచేశాం. ఇంకో అయిదు రూపాయలిట్టా పారెయ్." అన్నాడు.

"ఇంకో అయిదా? ఎందుకూ? మీకివ్వవలసింది ముందే ఇచ్చేశాగా!" అన్నాడు డాక్టరు.

"ఏడిశావులే. నోరుమూసుకుని అయిదు రూపాతా లిట్టా పారెయ్." అంటూ ఇంజన్ జో డాక్టర్‌మీదికి వచ్చాడు. డాక్టరుకు పాతికేళ్లకంటే ఎక్కువ వుండవ్. పిడికిలి బిగించి ఇంజన్‌జో మొహంమీద గుద్దాడు. జో గిర్రున తిరిగి వెనక్కి పడ్డాడు. పాటర్ తన చేతులో వున్న పెద్ద బాకును కిందపడేసి డాక్టర్‌తో కలబడ్డాడు. ఈలోగా ఇంజన్ జో లేచాడు. పాటర్ పడేసిన బాకు తీసుకుని, దెబ్బలాడుకుంటున్న ఆ యిద్దరిచుట్టూ వంగి తిరుగుతూ, డాక్టరుని పొడవటానికి చూస్తున్నాడు. డాక్టర్ పాటర్ పట్టునుంచి విడిపించుకుని ఆ పక్కనే వున్న ఒక బండరాయి నెత్తి పాటర్ నెత్తిమీద వేశాడు. వాడు "అమ్మోయ్" అని దొర్లకుంటూ పడి మూర్ఛపోయాడు. ఇదే సమయ మనుకుని ఇంజన్ జో ఒక్క దూకు దూకి బాకుతో డాక్టర్ గుండెల్లో పొడిచాడు. డాక్టర్ వెర్రికేక వేసి పాటర్ మీద పడిపోయాడు. కాసేపు అటూ యిటూ దొర్లి మూలిగాడు. రెండు నిమిషాలకల్లా చచ్చిపోయాడు.

ఇదంతా చూస్తున్న టామ్, హక్ గజగజ వణికిపోయారు.

ఇంజన్ జో డాక్టర్ని చంపగానే వాళ్లిద్దరూ పరుగు లంకించుకున్నారు. శ్మశానం దాటి రోడ్డు మీద పడ్డారు. ఊళ్లోకి చేరుకునే దాకా వెనక్కి తిరిగి చూడకుండా పరుగు తీశారు.

ఈలోగా ఇంజన్ జో బాకుని పాటర్ చేతులో పెట్టాడు. తను కొంచెం దూరంలో చదికిల పడ్డాడు. అయిదారు నిమిషాలకి పాటర్ కొంచెం కదిలి మూలిగాడు. అరచెయ్యి ముడిచి బాకుని పట్టుకున్నాడు. కళ్లు తెరచి బాకుని చూసి భయపడి దాన్ని వదిలేశాడు. నెమ్మదిగా మోచేతుల మీద లేచి మీద పడివున్న డాక్టరుశరీరాన్ని తోసేశాడు. లేచి కూచ్చుని చుట్టూ చూశాడు. జో కనిపించాడు.

"ఇదేమిటి జో! డాక్టరు చచ్చిపోయాడా?" అన్నాడు పాటర్.

"ఆ చచ్చిపోయాడు. ఎందుకు చంపేశావు పాపం అతన్ని?" అన్నాడు ఇంజన్ జో.

"నేనా? నేను చంపలేదే?"

"ఊరికే అబద్ధా లాడితే లాభం లేదు. నువ్వే చంపావు బాకుతో."

"ఛా! నేనే చంపానా? నాకు జ్ఞాపకం లేదు. ఇవ్వాళ బాగా తాగటం పొరపాటైంది. ఒరే జో! నిజం చెప్పరా? నేనే చంపానా? నాకు గుర్తులేదే చంపినట్టు. పాపం డాక్టరు కుర్రాడు రా; పైకి రావలసినవాడు. నేనెల్లా చంపానురా అతన్ని."

"నువ్వే చంపావు. నీమీద ముందు రాయి వేశాడు డాక్టర్. నువ్వు దిమ్మదిరిగి పడ్డావు. మళ్లీ లేచి బాకు పుచ్చుకుని డాక్టర్ని పొడిచావు. మళ్ళీ డాక్టర్ నిన్ను రాయితో కొట్టి, తను పడిపోయాడు. నువ్వు మూర్ఛపోయావు. డాక్టర్ చచ్చిపోయాడు."

"అరెరే. ఎంత పని జరిగింది. నేనసలు చంపుదామనుకోలేదు. నా జన్మలో నేనెప్పుడూ ఎవర్నీ చంపలేదు. ఒరే జో! ఎవరితోనూ చెప్పకుగదూ, నేను చంపినట్టు. నువ్వు చాలా మంచివాడివి. ఎవరితోను చెప్పకుగదూ. నీకాళ్లమీద పడుతున్నా. నన్ను కాపాడు." అంటూ పాటర్ జో కాళ్లమీద పడ్డాడు.

అల్లాగేరా? ఎవరితోనూ చెప్పనులే. నీ మీద నాకేమీ కోపం లేదు లే."

పాటర్ లేచి ఏడవటం మొదలెట్టాడు.

"ఊ. ఇహ ఏడవకు. అయిందేదో అయిపోయింది. ఇక్కడినించి పారిపోవాలి. నువ్వటు పో నేనిటు పోతాను." అన్నాడు హంతకుడు జో.

పాటర్ ఏడుపు ఆపేసి ఊరివైపుకి నడిచాడు. కొంత దూరం తూలుతూ నడిచి పరిగెత్తడం మొదలెట్టాడు. ఇంజన్ జో ఇంకోవైపుకి పరిగెత్తాడు.

* * *

టామ్, హాకల్‌బెరీఫిన్- ఇద్దరూ ఉరుకులు, పరుగులమీద ఊళ్లోకి చేరుకున్నారు. దోవలో ఏది కనిపించినా మనిషో, దెయ్యమో ననే వాళ్ళ భయం. ఎల్లాగైతే నేం ముందుగా కనిపించిన చెప్పుల దుకాణంలో వచ్చిపడ్డారు. రాత్రిళ్లు ఆ దుకాణంలో ఎవ్వరూ వుండరు. ముందు వసారా దాటి చీకట్లో ఒక మూల కూలబడ్డారు. ఆయాసంతో గుండెలు కొట్టుకుంటున్నాయి. ఇద్దరికీ ముచ్చెమటలు పోశాయి.

నెమ్మదిగా ఆయాసం తగ్గి మాట్లాడటానికి వీలైంది.

ఒరే హాక్. ఇప్పుడేం జరుగుతుందంటావు." అన్నాడు మెల్లిగా టామ్.

"డాక్టరుని చంపినవాడికి ఉరిశిక్ష పడుతుంది." అన్నాడు హాక్ అంతకంటే మెల్లిగా.

"చంపినవాడెవడో ఎల్లా తెలుస్తుంది. మనమే చెబుదామా?"

"మనమా? బలేవాడివే. ఒకవేళ కోర్టువాళ్లు ఇంజన్ జో చంపలేదని తీర్పు చెబుతారనుకో. వాడు జైలునించి వచ్చి మన్ని చంపెయ్యడూ."

"అవును, నిజమే. మనం చెప్పకూడదు."

"అంతగా చెబితే మఫ్ పాటర్ చెబుతాడేమో."

టామ్ మాట్లాడకుండా ఆలోచిస్తున్నాడు. మళ్ళీ ఇలా అన్నాడు. "మఫ్ పాటర్‌కి తెలియదు, ఎవరు చంపారో. వాడెల్లా చెబుతాడు?"

"పాటర్‌కి ఎందుకు తెలియదూ?" అన్నాడు హాక్.

"ఎందుకంటే, ఇంజన్ జో డాక్టర్ని చంపినప్పుడు, పాటర్ మూర్ఛలో వున్నాడు. వాడికి ఈ సంగతి తెలియనేతెలియదు."

"అవున్రా టామ్. నిజమే. నేనా విషయం మర్చిపోయాను."

"అంతే కాదు. డాక్టరు రాతితో కొట్టిన దెబ్బకి పాటర్ కూడా చచ్చిపోయాడేమో?"

"అహా, చావడులే. వాడు బాగా తాగివున్నాడు. తాగివున్నప్పుడు ఎంత దెబ్బ కొట్టినా నరే మనిషి చావడుట. మా నాన్న చెప్పాడు నాతో." అన్నాడు హాక్.

"హాక్! ఈ రాత్రి మనం చూసిన విషయాలు ఎవ్వరితోనూ చెప్పవు గదూ."

"ఛస్తే చెప్పను. ఇంజన్ జో ఎంతమందిని చంపాడో? మనం చెప్పామని వాడికి తెలిస్తే ఈగల్ని నలిపినట్టు నలిపేస్తాడు మన్ని. ఎవ్వరితో చెప్పకూడదని ఒట్టు పెట్టుకుందామా?"

టామ్ అందుకు ఒప్పుకుని ఒట్టు కోసం చెయ్యిజాపాడు.

"అబ్బే, చేతిలో ఒట్టు పనికి రాదు. ఆడపిల్లలతో స్నేహం చేసేటప్పుడైతే చెయ్యి గిల్లి, చెయ్యి ముద్దెట్టుకోవచ్చు. కాని ఇల్లాంటి పెద్ద విషయంలో అది పనికిరాదు." అన్నాడు హాక్.

టామ్‌కు యీ మాట రైటే ననిపించింది. ఇది కాస్తా, కూస్తా విషయమా? అర్ధరాత్రి పూట-శ్మశానంలో,- దెయ్యాలు తిరిగే చోట- హత్య జరగటం కళ్లారా చూశారు. టామ్‌కు ఇది తలుచుకునేటప్పటికి మళ్లీ చెమటలు పోశాయి.

దుకాణం వసారాలో వెదకగా ఒక తెల్లటి తోలు ముక్క కనిపించింది. టామ్ జేబులో పొద్దున్న స్కూల్లో మాష్టారికి తెలియకుండా కొట్టేసిన ఎర్రటి సీమసున్నం పిక్క వుంది. పెదిమల మధ్య నాలిక నొక్కిపట్టి తలకాయ అటూయిటూ తిప్పుతూ టామ్ తోలు ముక్కమీద ఇల్లా రాశాడు.

> హాక్ ఫిన్, టాంసాయర్ ఈ రహస్యమును ఎవరితోనైన చెప్పిన యెడల వారి శిరస్సులు వెయ్యి చెక్కలై పోవుగాక.
>
> ఇట్లు,

ఇంతవరకూ టామ్ రాశాడు. టామ్ ఇంత చక్కని భాషలో, అంత తొందరగా రాయటం చూసి హాక్ చాలా మెచ్చుకున్నాడు. (వాడికి అక్షరాలే రావు.) తరవాత తన చొక్కాకి వున్న ఇత్తడి పిన్నీసు తీసి బొటనవ్రేలిమీద గుచ్చబోయాడు. కాని టాం పిన్నీసు లాక్కుని,

"ఆగాగు. ఇది ఇత్తడి పిన్నీసు దీనితో గుచ్చితే విషం." అన్నాడు టామ్. తన జేబులో వున్న బట్టలు కుట్టుకునే సూది తీశాడు. దానితో తన బొటన వేలిమీద గుచ్చాడు. నెత్తురు వచ్చింది. ఇల్లా చాలాసార్లు గుచ్చి బొటనవేలిమీదకి నెత్తురు తెచ్చాడు. 'ఇట్లు' అని రాసిన దానికింద ఎలాగో తంటాలు పడి తన నంతకం చేశాడు. తరవాత హాక్ బొటనవేలిమీద సూదితో గుచ్చుకుని నెత్తురు చేసుకున్నాడు. టామ్ తన నంతకంకింద హాక్ చేత వేలి ముద్ర వేయించాడు.

ఇప్పటికి ప్రమాణం చెయ్యటం పూర్తయింది. ఈ ప్రమాణంతో వాళ్ల నోళ్లకి తాళాలు వేసి నట్లయిందన్నమాట. తరవాత ఆ తోలుముక్కను గోడపక్కనే కొద్దిగా తవ్వి, ఏవో మంత్రాలు చదువుతూ పాతిపెట్టారు.

వీళ్లీ పని చేస్తుండగా బయట వసారాలోకి ఎవరో నెమ్మదిగా వచ్చారు. కాని వాళ్లు చూడలేదు.

ఇంతలోకే రోడ్డుమీద ఒక కుక్క మోరెత్తి మొరగటం మొదలెట్టింది. ఇద్దరూ భయపడి ఒకళ్లనొకళ్లు గట్టిగా పట్టుకున్నారు.

అర్థరాత్రివేళ ఊరకుక్క అల్లా మొరగకూడదు. అది ఎటువేపు చూసి మొరుగుతుందో ఆవేపున వున్నవాళ్లు త్వరలో చచ్చిపోతారని పిల్లలందరికీ నమ్మకం. అందుకని టామ్, హాక్ భయపడ్డారు.

టామ్ నెమ్మదిగా అన్నాడు.

"ఎవరో చచ్చిపోతారు. తప్పదు."

"బహుశా, మనిద్దరం చచ్చిపోతామేమో?"

"హాక్, ఆ గోడ కన్నంలోంచి చూడరా?"

"బాబో, నాకు భయం. నువ్వే చూడు"

టామ్ ధైర్యం చేసి కన్నంలోంచి చూశాడు. సంతోషంతో ఇల్లాగన్నాడు.

"హాక్. ఆ కుక్క మన వేపుకు తిరిగిలేదు."

"అమ్మయ్య, అయితే మనకేమీ ఫరవాలేదు.

(46-వ పేజీ చూడండి)



# విక్రమసేనుడు

శ్రీ వేదుల సుబ్రహ్మణ్యం

పూర్వం విష్వక్సేనుడనే రాజు కోసల రాజ్యాన్ని పరిపాలిస్తూండేవాడు. అతనికి ఏడుగురు కొడుకులు. ఆఖరి వాని పేరు విక్రమసేనుడు. విక్రమసేనుని చిన్నప్పుడే అతని తల్లి చనిపోయింది. అందువల్ల ఆ ఏడుగుర్ని ఆ రాజు అతి గారాబంతో పెంచుతూ వచ్చాడు. ఆ కొడుకు లందరూ పెరిగి పెద్దవాళ్లయ్యారు. ఒక నాడు ఆ ఏడుగురు తమతండ్రి వద్ద కొంత ధనం తీసుకొని దేశాలన్నీ తిరిగి వస్తామని చెప్పి ప్రయాణమయ్యారు. కాని తన దగ్గర ఎవ్వరూ లేకపోతే తన కేమీ తోచదని రాజు ఆఖరి వాడైన విక్రమసేనుని తన వద్ద వుంచుకొన్నాడు.

ఆ ఆరుగురు కొడుకులు అలా వెళుతూ వుండగా వాళ్ల కొక గుహ కనపడింది. వాళ్లు అలసి వుండటం చేత అక్కడ కాస్త విశ్రాంతి తీసుకొనటానికి ఆగారు. ఆ గుహ ఒక రాక్షసుడిది. ఆ రాక్షసుడు ఎక్కడో తిరిగి తిరిగి వచ్చి వాళ్లను చూశాడు. చూసి ఊరుకోక వాళ్లందర్నీ శిలలుగా మార్చేశాడు.

అక్కడ విష్వక్సేనుడు తన కొడుకులు ఎంత కాలానికీ రాకపోవడంవల్ల విచారంలో మునిగిపోయాడు. అప్పుడు విక్రమసేనుడు తను వెళ్లి తన అన్నలను తీసుకొని వస్తానని తండ్రిని అడిగాడు. కాని రాజు ఒప్పుకోలేదు. చివరకు ఎలాగైతేనేం విక్రమసేనుడు తన అన్నలను వెదకి తీసుకొని రావడానికి బయలు దేరాడు. మార్గ మధ్యంలో అతనికి ఒక పక్షి ఎదురై "రాజకుమారా! నాకు చాలా ఆకలిగా వుంది. ఇప్పుడుగాని నువ్వు నన్ను రక్షించక పోతే నేను చచ్చిపోయేంత స్థితిలోవున్నాను. నువ్విప్పుడు నాకు సహాయం చేస్తే నేను నీకు అవసరమైనప్పుడు సహాయం చేస్తాను" అన్నది. ఆ మాటలు వినేసరికి రాజకుమారుడికి జాలి కలిగింది. తనతో తెచ్చుకున్న ఆహారంలో కొంత దానికిచ్చాడు. ఆ పక్షి తన కడుపు నింపుకొని రాజకుమారుని శెలవు తీసికొని ఎగిరి పోయింది.

మఱి కొంత దూరం వెళ్లేటప్పటికి అతనికి, నీటి ఒడ్డున నీటిలోకి పోలేక యిటూ, అటూ తన్నుకుంటూన్న ఒక చేప కనబడింది. ఆ చేప రాజకుమారునితో యిలా చెప్పింది. "నీవు నన్ను యిప్పుడు నీటిలో పడవేశావంటే నేను నీకవసరమైనపుడు తగిన సహాయం చేస్తాను." అప్పుడా రాజకుమారుడు ఆ చేపను నీటిలో వేసి, మళ్లీ ప్రయాణం సాగించాడు. అలాగ మఱి కొంత దూరం వెళ్లేటప్పటికి, అతనికి, యింకొక నిమి

వంలో చచ్చిపోయే నక్క యెదురైంది. దాన్ని చూచేసరికి అతనికి మిక్కిలి జాలి కలిగింది. తనవద్ద ఇంకా మిగిలి వున్న ఆహారం కొంత దానికిచ్చాడు. అది తన కడుపు నిండా తిని, ఆ రాజకుమారుణ్ణి ఎక్కడికి వెడుతున్నావని అడిగింది. రాజకుమారుడు తన సంగతంతా ఆ నక్కతో చెప్పాడు. అప్పుడా నక్క, అతని అన్నలు ఎక్కడ ఉన్నారో తనకు తెలుసునని చెప్పి, అతనిని తిన్నగా రాక్షసుడి గుహ దగ్గఱకు తీసుకు వెళ్లింది. ఎదురుగా కనబడే గది లోకి వెళితే ఒక రాజకుమార్తె కనబడుతుందని, ఆ రాజకుమార్తె అతనికి తప్పకుండా సహాయం చేస్తుందని చెప్పి, అతనిని ఆ గది లోకి పంపింది.

విక్రమసేనుడు ఆ రాజకుమార్తెతో తను వచ్చిన సంగతంతా చెప్పాడు. అప్పుడా రాజకుమార్తె, శిలలుగా మారిన అతని అన్నలనందఱిని చూపి, వారందఱిని మళ్లీ బ్రతికించటానికి రాక్షసుడి దగ్గఱ ఒక మంత్రకత్తి ఉందని చెప్పింది. విక్రమసేనుడు, రాజకుమార్తెతో రాక్షసుడి ప్రాణాలు యెక్కడున్నాయో కనుక్కొని చెప్పమన్నాడు. అప్పుడా రాజకుమార్తె రాక్షసుడు వచ్చే వేళయిందని చెప్పి విక్రమసేనుణ్ణి రాక్షసుడికి కనబడకుండా ఒకచోట దాచేసింది.

రాక్షసుడు రాగానే, రాజకుమారె రోజూకంటె యెంతో సంతోషంతో అతనికి సేవ చేయనారంభించింది. రాజకుమార్తె తనను నిజంగా ప్రేమించిందనుకొని రాక్షసుడు చాలా ఆనందించాడు. అప్పుడు రాజకుమార్తె యిలా చెప్పింది "మీరు వేటకై అడవికి వెళ్లేటప్పుడు మిమ్మల్ని యెవరైనా చంపేస్తారేమోనని నాకు చాలా భయంగా ఉంది." ఆ మాటలు విని రాక్షసుడు నవ్వి "ఓసి, పిచ్చిదాన! నా ప్రాణాలు తియ్యడానికి యెవ్వడికీ చేతగాదు. విను. నా ప్రాణాలు యెక్కడున్నాయో చెబుతాను. ఇక్కడి నుంచి తూర్పుదిక్కుగా వంద మైళ్లు ప్రయాణం చేస్తే ఒక లోతైన సరస్సు కనిపిస్తుంది. ఆ సరస్సు మధ్య కొండంత ఎత్తున్న గుడిఉంది. ఆ గుడి తాళంచెవులు ఆ గుడిపైన ఉంటాయి. ఆ గుడి లోపల ఒక బావి ఉంది. ఆ బావిలో ఒక బాతు యీదుతూ ఉంటుంది. ఆ బాతుకడుపులో ఒక గ్రుడ్డు ఉంది. ఆ గ్రుడ్డులో ఒక యీగ వుంది. ఆ యీగే నా ప్రాణం. ఆ యీగను చంపితే నేను చచ్చిపోతాను. కాని అది



# తమాషా ప్రశ్నలు



(1) ఒక పెద్ద మనిషి బజారుకు వెళ్లి కొన్ని పిప్పరమెంటు బిళ్లలు కొని తెచ్చి, తన ముగ్గురు కొడుకు లకీ పంచిపెట్టాడు. అసలు బిళ్లలలో సగమున్నూ, పైన మరొకటిన్నీ మొదటి వాడి కిచ్చాడు. మిగిలిన వాటిలో సగమున్నూ, మరొకటిన్నీ, రెండో వాడి కిచ్చాడు. ఇంకా మిగిలిన మూడు బిళ్లలూ ఆఖరి వాడి కిచ్చాడు. అసలు బిళ్ల లెన్ని ?

(2) రామూదగ్గిర రెండు దారం ముక్క లున్నాయి. అందులో ఒకటి రెండో దానికంటె రెట్టింపు అంగుళాల పొడుగున్నది. ఒక్కొక్క దారంముక్క నుంచి ఆరేసి అంగుళాలు కత్తిరించగా పెద్దది చిన్న దానికంటె మూడు రెట్లు పొడుగున్నది. అసలు మొదట్లో ఆ దారం ముక్కల పొడు గెంత ? ఇప్పుడు వాటి పొడుగెంత ?

(3) ఇంకొక మూడేళ్లలో రామూ వయస్సు-- ఇప్పటికి మూడేళ్లకిందట ఉన్న వయస్సుకి మూడు రెట్లు ఉంటుంది. రామూకి ఇప్పు డెన్నేళ్లు ?

(జవాబులు మరొక పేజీలో)

ఎవ్వడికీ సాధ్యం గాదు. అందువల్ల నువ్వు భయపడ నక్కర లేదు" అని చెప్పాడు. ఈ మాటలు విక్రమసేనుడు విని రాక్షసుడు అడవికి వెళ్లిన వెంటనే, తన గుర్రమెక్కి నక్కను, యిదివరకు, తన సహాయం పొందిన పక్షిని, చేపను వెంటబెట్టుకొని తిన్నగా ఆ సరస్సు దగ్గఱకు వెళ్లాడు.

నక్క తనవీపుపై విక్రమసేనుణ్ణి కూర్చోమని చెప్పి ఆ సరస్సును యీది, గుడి దగ్గఱ దింపింది. పక్షి గుడిపై కెగిరి గుడితాళపు చెవులను తెచ్చి రాజకుమారుడి కిచ్చింది. విక్రమసేనుడు తలుపులు తెరచి గుడిలో ప్రవేశించి బావిలో దిగాడు. బావిలో యీదుతూన్న బాతును పట్టుకున్నాడు. కాని బాతు, తనకు రాబోయే అపాయం గ్రహించి గ్రుడ్డును బావిలో వదిలేసింది. అప్పుడు విక్రమసేనుడు చేపను పిలిచి గ్రుడ్డు వెతకమన్నాడు. ఆ చేప నీటిలో దిగి ఆ గ్రుడ్డును వెతికి విక్రమసేనుడి కిచ్చింది. విక్రమసేను డా గ్రుడ్డును చితిపి ఆ ఈగను పట్టుకొన్నాడు. ఇంతలోకే రాక్షసుడు తనప్రాణాపాయాన్ని గ్రహించి అక్కడ కొచ్చి యిలాఅన్నాడు "నీవు నా ప్రాణాలు నాకు యిచ్చావంటే నువ్వు చెప్పిన పని చేస్తాను." కాని నక్క యీగను చంపెయ్యమని విక్రమసేనుడితో చెప్పింది. వెంటనే విక్రమసేనుడు తన చేతిలో ఉన్న యీగను చంపేశాడు. రాక్షసుడు చచ్చిపోయాడు. విక్రమసేనుడు రాక్షసుడి గుహకు తిరిగి వచ్చాడు. గుహ అంతా వెతికి మంత్రకట్టె తీసికొని తన ఆరుగురి అన్నలను తిరిగి మనుష్యులుగా మార్చి రాజకుమార్తెను తనతో తీసికొని, అన్నలతోసహా తన రాజ్యం చేరుకున్నాడు.

విష్వక్సేనుడు వీరందరినీ చూచి చాలా సంతోషించాడు. విక్రమసేనుడికి రాజకుమార్తె నిచ్చి వివాహం చేశాడు. తక్కిన ఆరుగురు కూడ వివాహం చేసుకుని రాజ్యాన్ని యేలుతూ సుఖంగా కాలంగడిపారు.

# మనదేశం

(4-వ పేజీ తరువాయి)

పెద్దతప్పిదాలు జరిగినవని ఆరోపణలు వచ్చినప్పుడు సందేహనివృత్తిచేయడానికి మంత్రు లెవరూ యత్నించలేదు. వీని నన్నిటినీ పాటిస్తూ కూచోవడం అసంభవం అంటారు. కాని ప్రజలలో కలుగుతున్న అనుమానాలను నివృత్తి చేయడానికి మంత్రులు ఒక్కపర్యాయంకూడా లక్ష్య పెట్టలేదు.

ఈ స్థితిలో మంత్రులపై దోషాలు విపరీతంగా ప్రచారంలోకి వచ్చాయంటే ఆశ్చర్యపడనవసరంలేదు. కాని సరైన ఆధారాలను చూపకుండా బాధ్యులైన నాయకులే ఈ ప్రచారంలో పాల్గొనడంతో దేశంలో ఒక విషమసమస్య ఏర్పడుతున్నది. దోషారోపణలు శాసన సభచర్చవరకూ వచ్చినతరవాత ఏ వర్గం చేస్తున్న ప్రచారం నిరాధారమైనదో తేలిపోగలదనే ఆశ ప్రజలకు కలగడం సహజం. ఈ దోషాలను నిరూపించడం కష్టం. సందేహనివృత్తి కావడం కష్టం. ఇంతవరకూ వచ్చినతరవాత కూడా సందేహనివృత్తికానిపక్షంలో దేశంలో మంత్రివర్గం ప్రతిష్ఠ, ఇప్పుడు పరిపాలకులుగా ఉన్నవారేకాక ఇకముందు పరిపాలనలోకి రాగల వారి ప్రతిష్ఠ కూడా సన్నగిల్లక మానవు.

నింశుసభలో నిలిచి గురుతుల్యులైన ప్రకాశంగారు మంత్రులపై దుష్పరిపాలనా నింద మోపుతుంటేగా వానిని విశ్వసించకూడదంటే అది ప్రజలకు కష్టం. మంత్రులు సవాలు చెయ్యడంతో విడిచిపెట్టక పూర్తి విచారణ జరిపించి తమ నిర్దోషిత్వాన్ని స్థాపించుకుంటేగాని పరిపాలనావిధానంలో ప్రజలకు విశ్వాసం కలగదు.

ఇంతవరకూ వచ్చిన వ్యవహారాన్ని పార్టీవిప్ లద్వారా ఓడించడానికి మంత్రివర్గం పూనుకోవడం ఆత్మవిశ్వాసలోపమే ప్రదర్శిస్తుంది. విషయాలనన్నిటినీ శాసన సభ్యులకు వివరంగా తెలిపి ఆరోపణలు నిరాధారమైనవని నిరూపించబడినతరువాత అన్యాయమైన ఆరోపణలుతెచ్చి ప్రచారం చేసినందుకు ప్రకాశంవర్గంవారిపైన తగు చర్య తీసుకోవడం సమంజసంకాని పార్టీ క్రమశిక్షణ పేరు చెప్పి ముందే బెదిరించడం సమంజసం కాదు.

ప్రకాశంగారు గురువారంనాడు మూడున్నరగంటలసేపు మంత్రులపై కేసుల్ని వివరించారు. అయిదు అంశాలపైనే మాట్లాడారు. వారి ఉపన్యాసం పూర్తికాలేదు. వారి ఉపన్యాస ధోరణిలో ఆవేశంకాని కోపం కాని కనిపించలేదు. సీతారామరెడ్డి, గోపాలరెడ్డి, భక్తవత్సలం, కూర్మయ్యగార్లు మాత్రం తమవల్ల దోషం లేదని మధ్య మధ్య రెండుమూడుసార్లు చెప్పుకున్నారు.

ఆశీర్వదించవలసిన వృద్ధనాయకుడు లేని శక్తి తెచ్చుకొని దోషాలు ఆరోపించినప్పుడు, ఈ విషయాన్ని ఎంత త్వరలో వీలైతే అంత త్వరలో తేల్చివెయ్యడం అవసరం.

## "రాజకీయ బాధితులు"

"రాజకీయ బాధితులు" అనేవారికి పారితోషికంఇవ్వడం ఉచితం కాదని పండిట్ నెహ్రూ పార్లమెంటులో అన్నారు. స్వార్థరహితబుద్ధితో దేశంకోసం భక్తితో చేసిన త్యాగానికి ప్రతిఫలంగా ధనంకాని, భూములుకాని ఇవ్వడం ఒక విధంగా దేశభక్తి పరులైన వారికి అవమానమనే చెప్పాలి. వాస్తవంగా వారికి పారితోషికం ఇవ్వాలంటే దేశసేవకు అధికావకాశా లివ్వడమే ఉచితం.

కాని మన రాష్ట్రంలో భూము లిస్తున్నారు. దీనిలో దోషం మన మంత్రులికి కనిపించలేదు. దోష మున్నదన్నవారిని అసూయాపరులని మంత్రులు నిందించారు. స్వాతంత్ర్యంకోసం చేసిన త్యాగానికి స్వాతంత్ర్యఫలమే ప్రతిఫలమన్న సత్యం వారికి గోచరించలేదు. మంత్రిపదవులనే భాగ్యాన్నీ, భోగాన్నీ తాము పూర్తిగా అనుభవిస్తున్నందువల్ల, అట్టి లబ్ధి తదితరులకి కూడా లభించడం న్యాయమనీ, ధనదానమూ, భూదానమూ ఇచ్చినట్లయితే ఆ లోటు తీరిపోతుందనీ, ఏలబ్ధీ లేకపోతే వాళ్లంతా బొత్తిగా చింతించవచ్చుననీ మంత్రుల అభిప్రాయం అయి వుండవచ్చును. కాని అసంతృప్తిచెందిన కాంగ్రెస్ వాదులందరూ పరాయి పార్టీలలో చేరిపోతారేమో ననే భయంకొద్దీ మంత్రులీ యెత్తు వేశారని సోషలిస్టులంటున్నారు. తమ గ్రూప్‌ని బలపరుచుకోడానికి మంత్రులు పన్నినపన్నాగమని ప్రకాశంవర్గంవారు కొందరంటున్నారు.

ఏది ఏమయినా మన పెద్దలు చెప్పినట్లు "కనకం," అధికారం మహాచెడ్డవి. అవి లేకపోయినా బాధే, ఉన్నా బాధే.

అందుకే అన్నారు పండిట్ నెహ్రూ, అసలు అనుమానాలకు తావివ్వకూడదని. ప్రభుత్వం ఇచ్చేదయితే దానాలకి పాత్రులైనవారు రాజకీయ బాధితులేకాదు, పాకిస్తాన్‌నించి సర్వం నీళ్లు వొదిలివొచ్చిన వాళ్లూ పాత్రులే. రోజూ మన వీధుల్లో అన్నాతురులై తిరిగేనిర్భాగ్యులూపాత్రులే.

## ప్రశ్న, జవాబు

మంత్రి శ్రీగోపాలరెడ్డిగారు గురువారంనాడు శాసన సభలో ఒక ప్రశ్నకు జవాబిస్తూ అన్నారు "మేం అరెస్టు చేస్తే అదే చాలు వాళ్లు బ్లాక్‌మార్కెటీర్లు అని నిరూపించడానికి."

ప్రశ్న ఏమిటో దీనికి ముందేమి ప్రశ్నోత్తరాలు నడిచాయో తెలియకపోతే ఈజవాబు తప్పకుండా అపోహలకి దారితీస్తుంది. తాము చేసేది ప్రతీపనీ నిక్కచ్చిగా సక్రమమైనదే అనే అకుంఠిత విశ్వాసం మంత్రులకు ఉండి ఉండాలి. లేకపోతే అసలు ప్రశ్న ఎలాటిదైనా ఇటువంటి జవాబురాదు.

సరిగ్గా ఈ జవాబువింటే మరొక విషయం స్ఫురణకి వస్తుంది - అది కమ్యూనిస్టుల వధ. పోలీసుల తుపాకిగుళ్ళ బారిపడి చనిపోయిన వాళ్ళంతా కమ్యూనిస్టులే. పోలీసులచేత లాఠీదబ్బలు, తన్నులు తిన్నవాళ్ళంతా కమ్యూనిస్టుల్ని గురించి సమాచారాన్ని తెలపకుండా దాచినవాళ్లే. ఇది నమ్మడానికి వీలుంటే, మొదటిదీ నమ్మవచ్చును. అయితే ఇంతవరకూ ఒక్క బ్లాక్‌మార్కెట్‌దారుకూడా అరెస్టు కాలేదు. బీహార్‌లో మాత్రం కొందర్ని అరెస్టుచేసి వీధివీధీ తప్పెట్లతో ఊరేగించారట.

అసలు ఇంతకీ గోపాలరెడ్డిగారు జవాబిచ్చినది ఏ ప్రశ్నకి అంటే, చెన్నపట్నంలో వర్తక ప్రముఖుడు, వర్తకుల ప్రతినిధి అయిన నటేశన్‌గారు వేసిన ఈ క్రింది ప్రశ్నకి "ఫలానివాడు బ్లాక్‌మార్కెట్‌దారని దేన్నిబట్టి నిర్ణయిస్తారండీ?"

ఇటువంటి ప్రశ్నకి జవాబెట్లా చెప్పడం! వ్యాపారస్తుల్లో నాలుగింట మూడువంతుల మంది కాంగ్రెస్‌లో చేరిపోయినప్పుడు ఎవరు బ్లాక్‌మార్కెట్‌దారైనదీ ఎలా కనిపెట్టడం? అంగువల్లనే గోపాలరెడ్డిగారు అటువంటి సమాధానం ఇవ్వవలసివచ్చింది.

[సీతారామ్]

# నేటిప్రపంచం

(8-వ పేజీ తరువాయి)

కన్న అమెరికా వోటు చెయ్యకపోగా, దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి ఆగ్రహం కలగకూడదంటూ రహస్యపు మంతనాలు జరుపుతోంది. శ్వేత జాతులన్నీ ఏకమై ఎంత కుట్రపన్నినా కనీసం తాత్కాలిక విజయాన్ని భారతదేశం సాధించగలిగింది.

పురాణ గాథల్లో ఉద్దాలకుడి కథను ఎవరూ సామాన్యంగా మరిచిపోరు. చెప్పే ప్రతివిషయంలోనూ విరుద్ధంగా ప్రవర్తించే భార్య చండితో వేగలేక ఉద్దాలకుడు ఒక ఉపాయం కనిపెట్టాడు. తనకు కావలసినదానికి విరుద్ధంగా చెప్పేవాడు. చెప్పినదానికి విరుద్ధంగా, అంటే వాస్తవంగా అతనికి కావలసిన రీతిని, చండి నిర్వర్తించేది. అదేరీతిగా ప్రతి సమస్యలోనూ రష్యా ఏది చెప్పితే దానిని ప్రతిఘటించే అమెరికాతో రష్యా ఉద్దాలకుడి ఉపాయాన్ని అవలంబించడం మొదలెట్టింది. ఆరుమాసాల క్రిందట ఐక్యరాజ్య సమితి కార్యదర్శి ట్రిగ్వీలీ ఒక శాంతిసాధన కార్యక్రమాన్ని సూచించాడు. ఈ కార్యక్రమాన్ని అందరిచేతా ఒప్పింపచెయ్యడంకోసం ట్రిగ్వీలీ పారిస్, మాస్కో నగరాలుకూడా వెళ్ళాడు. అప్పుడు అమెరికాలో ప్రతి నాయకుడూ, ప్రతి పత్రికా ఈ శాంతి సూచనను తిట్టిపోశాయి. ట్రిగ్వీలీ కమ్యూనిస్టుల్లో కలిసిపోయాడన్నాయి కొన్ని పత్రికలు. ఈ శాంతిసాధన కార్యక్రమం ఎందుకూ కొరగానిదని అమెరికన్ విదేశాంగమంత్రి ఎచిసన్ అన్నాడు.

ఇప్పుడా కార్యక్రమాన్ని సమితి 51 వోట్లతో ఆమోదించింది. అసలు ఈ కార్యక్రమం ప్రతిపాదించబడదని కూడా ఈ మాసం ఆరంభంలో సమితి ప్రతినిధివర్గాల్లో అనుమానం కలిగింది. దీనికి రష్యాచక్కని మందు పెట్టింది. రష్యన్ విదేశాంగ మంత్రి విషిన్‌స్కీ స్వయంగా ఆరు అంశాల కార్యక్రమాన్ని సూచించాడు. అసలురష్యా ఎలాటి కార్యక్రమాల్ని సూచించినా అమెరికా నిరాకరించే మాటనిజం. అయినా అమెరికా తీరా నిరాకరించకపోతే ఆశాభంగం అవుతుందని కాబోలు, జాగ్రత్తపడి చీనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని భద్రతా మండలిలో ప్రవేశపెట్టడాన్నికూడా ఒక అంశానిచేర్చి విషిన్‌స్కీ తనకార్యక్రమాన్ని సూచించాడు. అనుకున్నట్టుగా అమెరికా నిరాకరించింది. వెంటనే ట్రిగ్వీలీశాంతి సూచనల్ని తొమ్మిదిదేశాలు ప్రతిపాదించాయి. ప్రతిపాదించడం తడవు అమెరికా మద్దతుతో 51 దేశాలు అనుకూలంగా వోటు



విషిన్‌స్కీ

చేశాయి. ఈసూచన ప్రకారం అగ్రరాజ్యాలు తిరిగి ఏటంకంట్రోల్ గురించీ, సమితిసైనికశాఖ గురించీ రాయబారాలు జరపాలి. అగ్రరాజ్యాలు ఐదూ విదేశాంగ మంత్రులద్వారా రాయబారాలు జరిపి యుద్ధప్రమాదాన్ని నివారించాలి. ఈ అంశాలు విషిన్‌స్కీ సూచనలోనూ ఉన్నాయి. కావలసిన కార్యాల్ని నెరవేర్చుకునే నేర్పు రష్యన్లకి ఉన్నంత అమెరికన్లకి లేదు.

కొరియా యుద్ధం విషయంలో కూడా రష్యా సరిగ్గా ఇదే పద్ధతిని అనుసరించింది. ఉత్తరకొరియాలో చీనాకమ్యూనిస్టు సేనలు ప్రవేశించి అమెరికన్ సేనలకి సంపూర్ణవిజయం లభించకుండా ఆశాభంగం కలిగించాయి. చీనా యుద్ధంలో ప్రవేశించే అవకాశంలేదని మొదట చెప్పిన జనరల్ మెకార్థర్, ప్రవేశించాయని భద్రతామండలికి సమాచారం పంపాడు. ఈ విషయాన్ని చర్చించడానికి చీనా కమ్యూనిస్టు ప్రభుత్వం సంజాయిషీ ఇవ్వాలని అమెరికా కోరింది. సంజాయిషీ ఇవ్వడంకోసం పెకింగ్ ప్రతినిధివర్గం లేక్‌సక్సెస్ రావాలని కోరింది. చీనాతో యుద్ధం రాకుండా చేసుకోడంకోసం బ్రిటన్ వేరటి మార్గాలు వెతకనారంభించింది. సమితిసేనలకీ,మంచూరియా సరిహద్దుకీమధ్య కొంత మేర చీనా కమ్యూనిస్టులకు వొదిలెయ్యాలని ఒక సూచనచేసింది. బ్రిటన్ అంతమేరా ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యం ఉండాలని అమెరికా అన్నది. దీనికి చీనా సమ్మతించదని బ్రిటన్‌కి తెలుసును. అందువల్ల బ్రిటన్ అమెరికాలకు ఈ విషయమై అంగీకారం కుదరలేదు.

ఆ ప్రాంతంలో ఉత్తరకొరియన్ (కమ్యూనిస్టు) ప్రభుత్వం ఆధ్వర్యం ఉండాలని చీనా అభిప్రాయమైనట్లు ప్రచారం జరిగింది. దీనికి అమెరికా అసలు అంగీకరించదు. అయితే ఈ విషయమై చీనా కమ్యూనిస్టులకీ,అమెరికన్లకీ బ్రిటన్ మధ్యవర్తిత్వం వహించి రాయబారాలు నడిస్తే అంగీకారం కుదిరిపోతుందనే భయంతో, రష్యా చప్పున తానే ఆ సూచన చేసేసింది. సరిహద్దు పొడుగునా 40 మైళ్ళు దక్షిణంగా ఉత్తరకొరియన్ పరిపాలన ఉండాలని ప్రతిపాదించింది. అమెరికా వెంటనే నిరాకరించింది. అమెరికా ఏరాజీకైనా అంగీకరించిపోతుందనే భయంతో జనరల్ మెకార్థర్ కూడా యావత్తు బలాన్నీ ప్రయోగించి యుద్ధం ఆరంభించాడు. మొత్తానికి ఉత్తరకొరియాలో విజయంలభించాలంటే జనరల్ మెకార్థర్ చీనాతో యుద్ధానికి దిగకతప్పనిసరివచ్చి పడ్డింది. రష్యాకోరేది ఇదే.

కొరియానుంచి చీనా సేనలు తొలగిపోవాలంటే కొన్ని షరతులికి అమెరికన్లు అంగీకరించాలని అదివరలో పెకింగ్ ప్రభుత్వం సూచించింది. ఆ షరతుల్లో ముఖ్యమైనవి కొరియానుంచి అమెరికన్, బ్రిటిష్ మొదలైన దేశాలసేనలు తొలగిపోవాలనీ, ఫార్మోజా ప్రాంతంనుంచి అమెరికన్ నౌకాదళం, సేనలు తొలగిపోవాలనీ. కొరియా సమస్యకీ, ఫార్మోజా సమస్యకీ ముడిపెట్టడం విపరీతంగా ఉందని బ్రిటన్ అమెరికాలు వ్యాఖ్యానించాయి. కాని ఇలా ముడిపెట్టవలసిన కారణాల్ని గురించి పెకింగ్ చేసిన వివరణను ఏ రేడియో కాని, వార్తాసంస్థ కాని తెలపలేదు. అమెరికన్లకి కొరియానిగాని, ఫార్మోజానిగాని ఆక్రమించుకోవాలనే దురాశ లేదని అమెరి

కన్ ప్రభుత్వం పదేపదే ప్రకటిస్తోంది. యాలూ ప్రాజెక్టుల్ని మంచూరియా పరిశ్రమాల్ని హస్తగతం చేసుకోవాలనే దుర్వాంఛకూడా లేదని అమెరికన్లు అన్నారు.

ఇప్పుడాక్రమించుకోడానికి కారణం కమ్యూనిస్టుల దండయాత్ర ప్రమాదం ఉండడమేనని వారు చెప్పారు. అయితే అటువంటి దండయాత్ర చీనా దేశంనుంచిగాని, రష్యానుంచిగాని జరగలేదు., జరిగిన యుద్ధం కొరియన్లమధ్యనే కాబట్టి ఇతర దేశాలకి ప్రమేయం ఉండరాదని చీనా వాదన. ఈ వాదన ప్రకారం కొరియాలో చీనాసేనలూ ఉండకూడదు; అమెరికన్ సేనలూ ఉండకూడదు. కాబట్టి అమెరికన్ సేనలు తొలగిపోతే చీనా సేనలు నిష్క్రమిస్తాయి.

అమెరికన్లకి మంచూరియా పరిశ్రమల్ని ధ్వంసం చెయ్యాలనే దురుద్దేశంకాని, లేక ఆ పరిశ్రమల్ని చియాంగ్ కైషేక్‌కు ఒప్పగించి తమ ప్రయోజనం నిమిత్తం ఉపయోగించుకోవాలనే దురాశకాని లేనిపక్షంలో, కొరియాలో ఏ కొరియన్ రాజకీయపక్షం అధికారంలోకి వచ్చినా, వారిలోవారు యుద్ధాలు చేసినా ప్రమేయంఉండి ఉండదని చీనావాదన. మంచూరియా పైకి చియాంగ్ సేనల్ని పంపడమే అమెరికన్ల ఉద్దేశమనీ, ఆ ఉద్దేశమే లేకపోతే ఫార్మోజాను తాము రక్షించడానికి నౌకాబలాల్ని వినియోగించరనీ చీనావాదం. కాబట్టి చియాంగ్ సేనల్ని బలపరుస్తున్నంతకాలం అమెరికన్లని చీనా కమ్యూనిస్టులు నమ్మరు.

ఫార్మోజా భవిష్యత్తు సమస్యని ఐక్యరాజ్య సమితి నిర్ణయించాలని అమెరికన్ ప్రభుత్వం అంటున్నది. రెండో ప్రపంచయుద్ధానికి ముందు చీనాపై దురాక్రమణ జరిపిన జపాన్ ఫార్మోజానుకూడా ఆక్రమించుకొంది. కాబట్టి జపాన్ ఓడిపోగానే ఫార్మోజాను చీనాకు ఒప్పగించాలని, కైరోలో చర్చిల్, రూజ్‌వెల్ట్ చియాంగ్ కైషేక్‌లూ, తరువాత పోట్స్‌డామ్‌లో ట్రూమన్, చర్చిల్, స్టాలిన్‌లూ ఒడంబడికలు చేసుకున్నారు. ఇప్పుడా ఒడంబడికల్ని కాలదన్ని, అమెరికా ఫార్మోజా భవితవ్యం ఇంకా నిర్ణయం కావాలంటున్నది. అందువల్లనే అమెరికన్ల దురుద్దేశాల్ని గురించి చీనాకీ, రష్యాకీ ప్రబలమైన శంకలున్నాయి. అందువల్లనే మంచూరియా పరిశ్రమలకి ప్రాణాధారమైన యాలూనది ప్రాజెక్టుల్ని తాకబోరని అమెరికన్లు పత్రికలద్వారా ఎంత ప్రచారం చేయిస్తున్నా చీనా నమ్మలేకపోతున్నది. యాలూనదిపై ప్రాజెక్టుల్ని కాపాడుకోడానికి చీనా స్వయంగా యుద్ధంలోకి దిగడానికి వెనుదియ్యదు. అప్పుడే చీనా సేనలకు మంచూరియానుంచి సహాయం, ఆయుధ పరికరాలు వస్తున్నందువల్ల ఆపరిశ్రమలపైన బాంబులు వెయ్యాలని జనరల్ మెకార్థర్ సిద్ధపడుతున్నాడు. ఫార్మోజా పెకింగ్ ప్రభుత్వం అధీన మయ్యేవరకూ అమెరికాకూ, చీనాకూ మధ్య యుద్ధ ప్రమాదం తొలగదు.

[సూర్యనారాయణ]

# గ్రంథస్వీకారం

## మైఁ గరీబ్ హూఁ

ఉర్దూమూలం: శ్రీ కవిరాజమూర్తి.
తెలుగుతర్జుమా: శ్రీ గిడుతూరి సూర్యం
ప్రచురణ: ప్రజాసాహిత్య పరిషత్తు.
వెల: రూపాయి. హైద్రాబాదు.

"దరిద్రుణ్ణి" అనే శీర్షికగల ఈ నవలలో దరిద్రుడియొక్క ఆవేదనా, మనస్తత్వమూ చిత్ర విచిత్రాలుగా వర్ణించబడింది. దారిద్ర్యానికి కులమతాలతో సంబంధం లేదు. అదే దరిద్రుడి సమస్తమూనూ.

కవితావేశాన్ని వ్యక్తం చెయ్యటానికి ఉర్దూ అనువైన భాష. అయినప్పటికీ అనువాదకుడు మూలం తాలూకు సౌలభ్యాన్ని తెలుగులోకి చాలావరకు విజయవంతంగా తెచ్చినట్టు కనిపిస్తుంది.

ఈ నవలను ఒకందుకు విమర్శించవలసి ఉంది. దారిద్ర్యాన్ని గురించి మధ్యతరగతివాడు, వ్యక్తివాది ప్రకటించే భావాలే ఈ గ్రంథంలో జాస్తిగా ఉన్నాయి. కాని దరిద్రుడి దృక్పథం వాస్తవిక దృష్టితో సృష్టించబడలేదు. ధనికులు తమ ధనాన్ని దక్కించుకునేటందుకూ, పెంపొందించుకునేటందుకూ కూడా ఒక వర్గంగా కృషి నిరంతరం సాగిస్తున్నట్టే దరిద్రులుకూడా ఒక వర్గంగా తమ దారిద్ర్యాన్ని తొలగించుకునేటందుకు నిరంతర కృషి చేస్తున్నారు. దారిద్ర్యాన్ని చూసి దరిద్రులు నీరసపడిపోతే ఆ తరగతి ఏనాడో ఆత్మహత్య చేసుకుని ఉండేది.



## షాయర్

(23-వ పేజీ తరువాయి)

పోతాడు. ఈ మరిచిపోవటంలోని సుఖంకోసమే అతడు సినిమాకి వెళ్లేది. అతడు హాలు విడిచి బయటికి రాగానే మళ్ళీవాస్తవప్రపంచం వెయ్యి పడగల పాములాగా దైనికసమస్యల్ని విప్పుకొని ప్రత్యక్షమవుతుంది. సినిమాలో తనుపొందిన అనుభవం యీ సమస్యల ఎదుట ఎందుకూ కొరగాదు. ఇది తెలిసికూడా ప్రేక్షకుడు మళ్లీ మళ్లీ అవే సినిమాలకి పడతాడు - ఆ నిమిష నిషాకోసం.

సినిమాకళ భ్రష్టమై పోయిందనీ, నిర్మాతలు వ్యాపారదృష్టితో నే సినిమాలు ఉత్పత్తి చేస్తున్నారని విమర్శిస్తూ పరిష్కారసిద్ధాంతాలు ప్రతిపాదించేవారు ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఈ సమస్య అనేక ఇతర సాంఘికసమస్యలతో ముడిపెట్టుకుని వున్నది. ఈ సమస్యను వాటినుంచి విడదీసి ప్రత్యేకంగా పరిష్కరించాలనుకోవటం భ్రమ. అది అసాధ్యం.

---

## కర్రచిలుకలు

(32-వ పేజీ తరువాయి)

తండ్రివద్దకు వెళ్లి జరిగిన విషయమంతా చెప్పారు. రాజు చాలా సంతోషించి వారికి మహా వైభవంగా పెళ్లి చేశాడు.

ఆ రాజ్యంలో కొన్నాళ్లుండి, మామగారిచ్చిన వరకట్నం బోలెడు తీసుకుని మణికర్ణుడు భార్యతో తన రాజ్యానికి వచ్చాడు. అతని తలిదండులతన్ని ఎంతో ఆదరించి ధనాన్ని, కోడలిని కూడా తీసుకువచ్చినందుకు సంతోషించారు. మణికర్ణుడు, హేలాదేవి చిరకాలం సుఖంగా రాజ్యం చేశారు.

---

## టామ్‌సాయర్

(39-వ పేజీ తరువాయి)

కుక్క మొరగటం మానేసింది. కాసేపు నిశ్శబ్దం. మళ్లీ ఏదో చప్పుడు. ఇద్దరూ చెవులు రిక్కించి విన్నారు.

"ఎవరో గుఱ్ఱు పెడుతున్నట్టుంది. బయట వసారాలోకి వెళ్ళి చూద్దామా?" అన్నాడు టామ్.

"నువ్వు వెళ్లి చూడరా?"

"నేను ముందు నడుస్తాను. నువ్వు వెనకాలే రా."

ఇద్దరూ అడుగుల్లో అడుగు లేసుకుంటూ బయటికి వచ్చారు. ఎవరో మనిషి నిద్రపోతున్నాడు. కాళ్లు వెన్నెలలో వున్నాయి. తల నీడలో వుంది. దగ్గిరికి వెళ్లి చూశారు. మఫ్ పాటర్! ఇద్దరికీ గుండె లాగిపోయాయి. ఇక్కడికెల్లా వచ్చాడు పాటర్? కుక్క ఈ సారి పాటర్ కేసి తిరిగి మొరగటం మొదలెట్టింది.

"చూశావా, కుక్క వాడికేసి తిరిగి మొరుగుతోంది." అన్నాడు రహస్యంగా టామ్.

"అయితే పాపం పాటర్ చచ్చిపోతాడన్నమాట."

ఇద్దరూ ఊపిరి బిగపట్టి దుకాణం దాటి రోడ్డుమీద కొచ్చారు. హక్ తన ఇంటికేసి, టామ్ తన యింటికేసి తిరిగి వెళ్లిపోయారు.

టామ్ నెమ్మదిగా ఇంటికి చేరుకుని పక్కలో దూరి ముసుగుతన్ని పడుకునేటప్పటికి తెల్లవారి అయిదు గంటలు కావచ్చింది. తను ఇంట్లోంచి వెళ్లటం ఎవరూ చూడలేదు గదా, బతికాను, అనుకున్నాడు. కాని దొంగనిద్ర పోతూ గుఱ్ఱు కొడుతున్న సిడ్ గంటసేపటి నుంచీ మేలుకునివున్నట్టు టామ్‌కి తెలియదు. (ఇంకావుంది)

---

**తమాషా ప్రశ్నల జవాబులు.**

(1) 18 బిళ్లలు.

(2) మొదట ఒకటి 12అంగుళాలు, రెండోది 24అంగుళాలు; కత్తిరించిన తరవాత ఒకటి 6అం॥ లు, రెండోది 18అం లు

(3) 6 సంవత్సరాలు.



Regd No. M. 4479



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, ThambuChetty St, Madras